# త్వరగా! నింపండి గ్లాసులు మళ్లీ...



# ...కావాలి ఈ మజా మళ్లీ మళ్లీ!

పార్టీలో మజా తగ్గనివ్వకండి. రస్న పానీయాన్ని అలా వరదగా పారనీయండి. రుచికరంగా దాహం తీర్చే పానీయం రస్న! ప్రతీ రస్న ప్యాక్ నుంచీ ఎన్నెన్నో గ్లాసులు! ఇలా ఖాళీ అయిన గ్లాసుల్ని అలా రస్నతో నింపి ఇచ్చేస్తూంటే ఉత్సాహం ఉప్పొంగుతుంది.

**పదకొండు పసందైన పార్టీ రుచులు!**

☐ ఆరెంజ్ ☐ పైనాపిల్ ☐ లైమ్ ☐ షాహీ గులాబ్
☐ కాలా ఖట్టా ☐ కూల్ ఖుస్ ☐ కేసర్ ఇలైచి
☐ మసాలా సోడా (జల్ జీరా) ☐ టూటీ ఫ్రూటీ
☐ గ్రేప్ గ్లోరీ ☐ మేంగో రైప్

ఐ లవ్ యూ రస్నా

**రస్న**






భారతదేశపు • అత్యధికంగా • అమ్ముడవుతున్న
సాఫ్ట్ డ్రింక్ • కాన్సంట్రేట్

BOMBAY'S

# Kwality

ICE CREAM



అత్యంత అహ్లాదాన్ని, అతిముఖ్యమైన
పోషక విలువలనీ ఐస్‌క్రీమ్‌లో
సంగమింప చేసే అపూర్వమైన కళకి
ఆకారం యేర్పడితే - అదే
స్వింగర్ ఐస్‌క్రీమ్
అమృత తుల్యమైన రుచీ, అమూల్యమైన
పౌష్టికత కలగలసిన
అద్భుతమైన స్వింగర్
క్వాలిటీ వారి కీర్తి కిరీటంలో
మరొక కలికితురాయి. ఛెర్రీల
సింగారంతో చిదానందం తొణికిసలాడే
స్వింగర్ ఆరగించండి.
ఆటపాటల్లో గడిపే పిల్లలకి మాత్రమే కాదు
అనుభవం పండిన మీ కోసం కూడా !



మీరు కోరుకునే ప్రత్యేకమైన రుచుల కొరకు
పై గుర్తు కోసం చూడండి.

# క్వాలిటీ

ఐస్‌క్రీమ్

మీరు ప్రేమించే మధురమైన మీ కలల క్రీమ్

## వి.బి.సి. ఫుడ్స్ ప్రైవేట్ లిమిటెడ్

తాడిగడప - 521 137 విజయవాడ




LAA

# విజేతలకు చందమామ అభినందనలు

## మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ

**2**



















ఎ. రేష్మ
C/O ఎ. ఆర్. ఎన్. దొర
పోస్టుమాస్టరు,
P. O. పురుషోత్తమపూర్
గంజామ్‌జిల్లా (ఒరిస్సా)

**I Prize**

యం. విజయ్
S/O బక్కయ్య,
ఇం. నెం. 3-4-2,
కోహిర్ బేస్,
సదాశివపేట 502 291

**II Prize**

పి. రుపేంద్రకుమార్ రెడ్డి
D. No. 8/53-B.
శ్రీరాములపేట,
ప్రొద్దుటూరు-516 361
కడపజిల్లా

**III Prize**

A CHANDAMAMA PUBLICATION

# చందమామ

సంస్థాపకుడు : 'చ క్ర పా ణి'
సంచాలకుడు : నా గి రె డ్డి

ఈ నెల బేతాళకథ [''పిల్లదయ్యంచదువు'']కు ఆధారం, ''వసుంధర'' రచన. బాల్య, కౌమార, యవ్వన, వార్ధక్యదశలనేవి, లోకంలో ఏ ప్రాణీ అధిగమించలేని ప్రకృతిధర్మం. అయితే, కొందరు అధికార, ఐశ్వర్యప్రలోభాలకు దాసులై, దీనికి అతీతులుగా జీవించాలని ప్రయత్నిస్తారు. దాని ఫలితం ఎలా వుంటుందో, ''ఒకరాణీకథ'' అన్న దానిలో తెలుసుకుంటాం.

## అమరవాణి

భవంత్యపి విష్ఫలైవ, ధనర్ద్ధిర్భవతి కృపణ పురుషస్య,
గ్రీష్మాతప సంతప్తస్య, నిజకచ్ఛాయేవ పథికస్య.

[వేసవి ఎండలో నడిచేవాడి నీడ, అతనికి ఏమాత్రం ఉపయోగ పడని విధంగా, పిసినారి కూడబెట్టే ధనం అతనికి ఉపయోగ పడదు.]

సంపుటి 82 ఏప్రిల్ '88 సంచిక 4

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00

CHITRA

# చందమామ కబుర్లు

## శాంతికపోతాలు

ప్రపంచం మొత్తం నుంచి వేనవేల మంది ప్రజలు, తాము ఎటువంటి ప్రపంచంలో నివసించాలని ఆశిస్తున్నదీ తెలియజేస్తూ—సోవియట్ అధినేతకూ, అమెరికా అధ్యక్షుడికీ ఉత్తరాలు రాశారు. వాటిలో 2,50,000 ఉత్తరాలు, 'శాంతికపోతం' ప్రచారభాగంగా, అణ్వాయుధ నిరాయుధీకరణకు కృషి చేయమని అగ్రదేశాధిపతులకు విజ్ఞప్తి చేశాయి।





## పంచదార శిఖరం!

కోలాలంపూర్‌లోని ఒక హోటల్లో యూవ్ రిచర్డ్ పని చేస్తున్నాడు. ఈ ఫిల్‌టవర్ నమూనాలో అతడొక పంచదార శిఖరాన్ని రూపొందించాడు. 48 కి. గ్రా. పంచదారతో 2.43 మీ॥ ఎత్తయిన ఈ పంచదార శిఖరాన్ని నిర్మించడానికి అతనికి 80 గంటలకాలం పట్టింది।

## కుజగ్రహయాత్ర

సోవియట్ యూనియన్, అమెరికా కలిసి కుజగ్రహానికి మనుషులు గల అంతరిక్షనౌకను పంపాలన్న కోరికను సోవియట్ నాయకుడు మిఖైల్ గోర్బచేవ్ వ్యక్తం చేశారు. ఇటీవల వైట్‌హౌస్‌లో అమెరికా ప్రముఖులతో జరిపిన సంప్రదింపుల అనంతరం, గోర్బచేవ్ ఈ విషయం వెల్లడించినట్టు కరేన్ ముల్హాసర్ అనే ప్రముఖ వనిత తెలియజేశారు।






## వనంలో అతిథులు

భువనేశ్వర్ సమీప నందన్ కానన్ వనానికి టెక్సాస్ నుంచి రెండు చింపాంజీలు, ఒక బబూన్‌కోతి, మూడు కోతులు మూడు మార్మొసెట్‌జాతి కోతులూ, రెండు కంగారూలూ తీసుకురాబడ్డాయి. రెండు నెలలలో మరో 13 మృగాలను టెక్సాస్ నుంచి ఇక్కడికి తెప్పించనున్నారు. మార్పిడి ఒప్పందం ప్రకారం—నందన్‌కానన్ నుంచి ఒక జత తెల్ల పులులను అధికారులు టెక్సాస్‌కు పంపనున్నారు।

# కళ-వ్యాపారం

పట్టాభి అనే చిత్రకారుడు, డబ్బు అవసరం అయి, తాను వేసిన ఒక మంచి చిత్రాన్ని అమ్మకానికి పెట్టాడు. అయితే, ఎవరూ దాన్ని ఒక్క వరహాకయినా కొనేందుకు ముందుకు రాలేదు.

ఈ సంగతి తెలిసి, దూరప్రాంతాన వుండే విఠలు డనే చిత్రకారుడి మిత్రుడు వచ్చి, ఆ చిత్రాన్ని తన వెంట తీసుకుపోయి, పదిమందికీ కనిపించేలా ఇంట్లో వేలాడదీయించాడు.

తర్వాత విఠలుడు, ఆ చిత్రాన్ని ఒక విదేశీచిత్రకారుడి నుంచి యాభై వరహాలకు కొన్నట్టు చెప్పసాగాడు. ఎవరైనా కొంటామనివస్తే, అది అమ్మడానికి తేలేదని కసురుకునేవాడు.

ఈ చిత్రం గురించి పక్క ఊరి జమీందారుకు తెలిసింది. ఆయన వచ్చి విఠలుడి చేతిలో బలవంతంగా రెండువందలవరహాలుపెట్టి, చిత్రాన్ని తీసుకుపోయాడు.

విఠలుడు, పట్టాభిని చూడవచ్చి, రెండువరహాలు అతడికివ్వబోయాడు. పట్టాభి ఆశ్చర్యపోతూ, "ఎందుకిస్తున్నావీడబ్బు?" అని అడిగాడు.

"ఇది నీ చిత్రం ఖరీదు," అన్నాడు విఠలుడు.

"అంత ధరకు అమ్ముడయిందా?" అన్నాడు పట్టాభి నమ్మలేక.

విఠలుడు జరిగింది చెప్పి, "చిత్రం వేయడమే కాదు, దాన్ని అమ్మడం కూడా ఒక కళే!" అన్నాడు.

—టి. గురురామప్రసాద్





# ఒకరాణీకథ

ఒకానొకప్పుడు ఫ్రాన్స్ దేశంలో, ఒక మహారాణి వుండేది. ఆమె భవనం చక్కటి పాలరాతితో కట్టబడింది. దాని కప్పు వెండిది. ఆ భవనంలో వున్న ప్రతి వస్తువూ బంగారందే. పైగా, వాటిపైన రంగురంగుల నవరత్నాలు తాపబడి వుండేవి. నిజానికి, ఆ రాణీ ఒక మంత్రగత్తె! ఆవిడకు కావలసినవన్నీ క్షణాల మీద అమరిపోయేవి.

ఆవిడకు చేతకానిదల్లా, ఒక్కటే— అదేమిటంటే, ఆవిడకు యవ్వనవతిగా మారిపోయే శక్తి మాత్రం లేదు. ఆవిడ తన యవ్వనంలో, ఎంతో అందంగా వుండేది. కాని యిప్పుడు ఎంత అంద వికారంగా అయిపోయిందంటే—పని మీద ఆవిడతో మాట్లాడడానికి వచ్చే వాళ్ళందరూ, ఆవిడను చూడలేక, ఏదో ఒక వంకతో ముఖం తిప్పేసుకునేవాళ్ళు. రోజంతా దగ్గుతూ, ముడతలుపడ్డ శరీరంతో వణుకుతూ నడుస్తూండేది.

అలాంటి దశలో, ఆమెకు అద్దం చూసుకోవడం కూడా యిష్టం వుండేది కాదు. ఆవిడ కన్నొకటి పూర్తిగా గుడ్డిదయి పోయింది. ఏమాత్రం అందమయిన మనిషి కనిపించినా పలకరించేది కాదు. తన భవనంలో పనివాళ్ళుగా, ఒంటికన్ను వాళ్ళనూ, గూనివాళ్ళనూ నియమించుకున్నది.

ఒకనాడు, పదిహేనేళ్ళ అమ్మాయి ఒకతె, ఈ రాణీ దగ్గిరకు వచ్చింది. ఆమెది అద్భుతమైన అందం. ఆమె పేరు మేరీ.

ఆమెను చూస్తూనే రాణీ, నిప్పుతొక్కిన కోతిలా లేచి, "ఈ పిల్లను ఎవరు నా ముందుకు తీసుకువచ్చారు? ఎన్ని గుండెలు వాళ్ళకు! తక్షణం పంపించి

వినయమణి

వేయండి," అంటూ అరిచింది పట్టరాని కోపంతో.

కాని, మేరీ ఏమాత్రం భయపడక, "మహారాణీగారూ, నాకు మంత్రాలు తెలుసు. ఒక్క క్షణంలో నా అందాన్నీ, యవ్వనాన్నీ మీకివ్వగలను, ఏమంటారు?" అని అడిగింది.

ఆ మాటలు వింటూనే రాణీ ముఖంలో కోపం పోయి, సంతోషం చోటు చేసుకున్నది. ఆమె, మేరీ కేసి గుచ్చిచూస్తూ, "అలాగా! అయితే, నీవిచ్చేదానికి బదులుగా, నీకేం కావాలి?" అని ప్రశ్నించింది.

"మీ దగ్గిర వున్న ధనం అంతా యివ్వాలి. మీ కిరీటం కూడా యివ్వాలి," అన్నది మేరీ.

రాణీ, ఆ కోరిక వింటూనే ఉగ్రురాలై పోయి, "ఏమిటీ, ధనం, కిరీటమా! ముసలిదానిగా, అనాకారిగా చావనైనా చస్తానుగానీ, ధనాన్నీ, కిరీటాన్నీ మాత్రం యివ్వను. ముందు యిక్కణ్ణించి ఫో!" అంటూ అరిచింది.

మేరీ నిరాశతో అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

కొన్నాళ్ళ తర్వాత రాణీ జబ్బుపడింది. సేవచేసే పనికత్తెలు కూడా, దగ్గిరకు వెళ్ళడానికి అసహ్యించుకోసాగారు. కొద్ది వారాల్లోనే, ఆమె మరణిస్తుందని రాజవైద్యులు తేల్చేశారు.

ఆ స్థితిలో రాణీ, అంతకు ముందు తన దగ్గిరకు వచ్చిన మేరీ కోసం వెతికిం



చింది. తన అశేష ధనంతో పాటు, కిరీటాన్ని కూడా యిస్తానని ఆమెకు కబురు పెట్టింది.

మేరీ వచ్చి, రాణీని కలుసుకుని, ''మహారాణీ! మీరిచ్చేదానికి బదులుగా, నా అందాన్నీ, వయసునీ యిచ్చేస్తే, నేను మరుక్షణం ముసలిదానిగా, అనాకారిగా మారిపోతాను. లోగడ మీరేమో, యిందుకు ఒప్పుకోలేదు. ఇప్పుడేమో, నాకు భయంగా వున్నది,'' అంటూ కాస్త తటపటాయించింది.

రాణీ, ఆ అమ్మాయిని ఎంతగానో పొగిడి, తియ్యని మాటలతో మురిపించి చివరికి ఎలాగైతేనేం ఒప్పించింది. ఇద్దరి మధ్యా ఒప్పందం కుదిరిపోయింది. ఒక్క క్షణ కాలంలో, ఆ యిద్దరి రూపాలూ తారుమారయ్యాయి!

రాణీ యిప్పుడు అందంగా, హుందాగా తయారయ్యింది. ఆమె దేహచ్ఛాయ మేలిమి బంగారంలా మెరిసిపోతున్నది. కళ్ళల్లో మెరుపు; ఒళ్ళంతా యవ్వనంతో తొణికిసలాడుతున్నది. అక్కడ వున్న వాళ్ళందరూ, ఆమె అందం చూసి ముగ్ధులైపోయారు. అయితే, యిప్పుడామె, ఏ గ్రామానికో వెళ్ళిపోయి, పూరిపాకల్లో నివసిస్తూ, చింకిగుడ్డలు కట్టుకుని జీవితం గడపాలి.

ఇక మేరీ రూపం, చూడ్డానికి ఏవగింపు కలిగేలా తయారయింది. ఆమె యిప్పుడు అందమైన పెద్ద రాజభవనంలో రాణీ!





చేద్దామనుకున్నది గాని, చేతికర్ర ఆసరా వుంటే తప్ప, లేకపోతే నిలబడడమే కష్ట మవుతున్నదామెకు. పళ్ళు లేకపోవడం వల్ల, ఏదో పలచటిజావ తప్ప, రుచికర మైన ఆహారం తినడం, ఆమెకు సాధ్య పడడం లేదు.

క్రమంగా మేరీకి పశ్చాత్తాపం కలగ సాగింది. తాను పిచ్చిదానిలా కిరీటం కోసం—అందాన్నీ, యవ్వనాన్నీ, ధార పోసింది. ధనం ఎంతవుండీ ఏం లాభం, అనుభవించలేకపోయాక ?

లోగడ గొర్రెలను కాస్తూ, ఆడుతూ పాడుతూ రోజంతా గడిపే మేరీకి, యిప్పుడు రాజ్యవిషయాలు అర్థం చేసు కుని, సరిదిద్దడం చేతకావడం లేదు.

పూర్వం, మేరీ నివసించిన గ్రామం చేరిన రాణిలో కూడా ఎక్కడలేని పశ్చాత్తాపం మొదలయింది. రాజ్యం, రాజ సుఖాలూ లేనందుకు బాధపడసాగింది. ముసలితనపు అసౌకర్యాలనూ, బాధలనూ ఆమె మరిచేపోయింది. పేదరికంలో బతక వలసిరావడం, ఆమెకు భరించరానంత కష్టంగా తయారైంది.

''ఏమిటి ? నేనిలా చిరిగిన, మాసిన బట్టల్లో కాలం గడపవలసిందేనా ? వీటిల్లో నా అందం, యవ్వనం ఏం రాణిస్తాయి ? ఈ చిన్న పల్లెలో, నా అందం చూసి

తానెలా వున్నదీ చూసుకుందామని, మేరీ అద్దం తెప్పించుకున్నది. అద్దంలో తన ముసలిరూపం చూసుకుని భరించ లేక, రెండు చేతులతోనూ ముఖం కప్పేసు కున్నది. తన ఎదటికి ఎవరూ రాకూడదని, ఆజ్ఞలు జారీ చేసింది. చుట్టూ వున్న ధన రాసుల్ని చూస్తూ, తనను తాను సముదా యించుకోవాలని ఎంతగానో ప్రయత్నిం చింది. కాని, బంగారం, వజ్రాలూ ఆమెను ముసలితనపు బాధల నుంచి కాపాడలేక పోయాయి.

మేరీ తన సొంతగ్రామంలో, స్నేహితు రాళ్ళతో కలిసి పూలతోటల్లో, చెట్లనీడల్లో నాట్యం చేసేది. అదే అలవాటుగా నాట్యం

మెచ్చేవాళ్ళెవరున్నారు? అందరూ మొరటు మనుషులే! అయ్యో, తెలివి తక్కువకొద్దీ అందం కోసం, యవ్వనం కోసం, కిరీటాన్నీ, బోలెడు ధనాన్నీ యిచ్చేశాను. వాటన్నిటినీ తిరిగి సంపాయించుకోగలిగితే, ఎంత ఆనందంగా వుంటుంది!'' అని విచారపడసాగింది రాణీ.

రాణీకి తానిప్పుడు ఏం చేయాలో పాలుపోక, దుఃఖం ముంచుకువచ్చేది. ముసలితనాన్ని తిరిగి తీసుకుంటే, త్వరలో మరణిస్తానేమో అన్న బెంగపుట్టేది.

ఒకనాడామె బాగా ఆలోచించి, ఒక నిశ్చయానికి వచ్చింది. ఎంత గొప్ప రాణీలకైనా మరణం తప్పదనుకున్నదామె. ముసలితనాన్నీ, అనారోగ్యాన్నీ, బాధల్నీ ధైర్యంగా భరించాలి! అంతేగాని, యవ్వనం కోసం ధనాన్నీ, రాజ్యాధికారాన్నీ వదులుకోవడం, ఒట్టి పిచ్చితనం అవుతుంది!

ఇలా ఆలోచించి రాణీ, రాజభవనానికి తిరిగి వచ్చింది. రాణీని చూడగానే ఆమె ఎందుకు వచ్చిందో మేరీ యిట్టే గ్రహించింది. ఎక్కువ మాటలు లేకుండా, ఇద్దరూ తమ, తమ పాతరూపాలకు మారిపోయారు.

ఆ మరుక్షణంలో, రాణీ తన ముసలి రూపాన్ని చూసుకుని బెంబేలుపడిపోతూ, ''మేరీ, పొరబాటు చేశాను. నీ యవ్వనమే బావున్నది. మళ్ళీ రూపాలు మార్చుకుందామా?'' అన్నది.

అందుకు మేరీ ఒప్పుకోక, ''రాణీగారూ, మన రెండు రకాల జీవితాలూ బాగా నాకు అనుభవంలోకి వచ్చాయి. బాధలుపడుతూ, సమస్యల్లో మునిగి తేలుతూ, రాణీగా వుండడం, నా కిష్టం లేదు. యవ్వనంతో వుండి, జొన్న రొట్టెలు తింటూ, గొర్రెలను మేపుకోవడమే, నాకు సుఖంగా వుంటుంది. ఎన్ని రాజ్యాలూ, ఎంత ధనం యిచ్చినా, మళ్ళీ నేను ఆ పొరబాటు చేయను! సెలవు; వెళ్ళొస్తా,'' అంటూ ఛెంగున అక్కణ్ణించి పరిగెత్తి పోయింది.





# నిజమైనప్రేమ

అమరావతీ పట్టణంలో, ఆదిశేషయ్య అనే ఒక పెద్ద నగలవర్తకు డుండేవాడు. ఆయనకు గంగ, యమున, సరస్వతి అని ముగ్గురు కుమార్తెలు. వాళ్ళకు యుక్త వయసు వచ్చేసరికి, తల్లి చనిపోయింది.

ఆదిశేషయ్యకు ఆలస్యంగా సంతానం కలగడం చేత, కుమార్తెలకు పెళ్ళీడు వచ్చేసరికి, ఆయన వృద్ధాప్యదశకు చేరుకున్నాడు. దానికితోడు అనారోగ్యం. ముగ్గురు కుమార్తెలకూ, ఒకేసారి పెళ్లిళ్లు చేసి, తన ఆస్తినిసమంగాపంచేసి, విశ్రాంతి తీసుకోవాలని, ఆయన ఆలోచించాడు.

ఆదిశేషయ్య ఒకనాడు కుమార్తెలతో, "నాకా వయసు మళ్ళింది. ఇప్పుడు వ్యాపారం పనులు చూసుకునే శక్తి తగ్గిపోతున్నది. మరొకటి, రెండు సంవత్సరాల కన్న ఎక్కువకాలం బతకనని, వైద్యులు చెబుతున్నారు. అందుచేత, మీ ముగ్గురికి ఒకేసారి పెళ్ళిళ్ళు జరిపించి, నా చివరి కోరిక అయిన కాశీయాత్ర ముగించుకుని రావాలని వున్నది. వచ్చిన తర్వాత, జీవించే ఆ కొద్దికాలాన్నీ, మీలో ఒక్కొక్కరి దగ్గిర వంతులవారీగా, కొన్నేసి రోజులు గడపాలనుకుంటున్నాను. ఇందుకు మీరేమంటారు?" అన్నాడు.

పెద్ద కూతురు గంగ కొంచెంసేపు ఆలోచించి, "నాన్నా, నువ్వు చెప్పింది బాగానే వున్నది. కాని, వివాహమైన తర్వాత భార్య, భర్త చెప్పుచేతల్లో వుండవలసిందేకదా! నువ్వు వచ్చి మాతో వుండడానికి, నా భర్త ఒప్పుకుంటాడో లేదో, యిప్పుడే ఎలా చెప్పగలను?" అన్నది.

ఆదిశేషయ్యకు, కూతురు చెప్పిన దాంట్లో నిజం వున్నదనిపించింది.

ఆయన, రెండవ కూతురు యమునను, "నువ్వేమంటావు, తల్లీ?" అని అడిగాడు.

జి. సి. జీవి

అందుకు యమున, "అక్క చెప్పింది నిజమే కదా! పెళ్ళయాక భర్త ఎలా ప్రవర్తిస్తాడో ఎవరు చెప్పగలరు? అందువల్ల, నేనొకటనుకుంటున్నాను," అని ఆగింది.

"ఫర్వాలేదు, చెప్పు, తల్లీ!" అన్నాడు ఆదిశేషయ్య.

"నాకు, యీ పట్టణంలోనే సంబంధం చూడు, నాన్నా. అప్పుడు నేను వేరే ఇంట్లో కాపరం వున్నా, దగ్గర్లోనే వుంటాను గదా. అప్పుడప్పుడూ వచ్చి, మీ బాగోగులు చూసి పోతూంటాను," అన్నది యమున.

ఆదిశేషయ్య, "సంతోషం, తల్లీ!" అని, ఆఖరి కూతురైన సరస్వతితో, "నీ అభిప్రాయం కూడా చెప్పమ్మా," అన్నాడు.

అంతవరకూ తలవంచుకుని, అక్కల మాటలు విన్న సరస్వతికి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. ఆమె బొంగురుపోయిన గొంతుతో, "నా పెళ్ళికి అంత తొందర ఏం లేదు, నాన్నా! అసలే అనారోగ్యంగా వున్న మీరు, ఒంటరిగా కాశీకి వెళ్ళడం నాకిష్టంలేదు. నేనూ మీతోపాటు వస్తాను. తిరిగివచ్చాక, మీరు జీవించి వున్నన్ని రోజులూ, మీకు తోడుగా వుంటాను. ఆ తర్వాత, ఎట్లా రాసి పెట్టి వుంటే అట్లాజరుగుతుంది!" అన్నది.

కూతురి ప్రేమాభిమానాలు చూసి, ఆదిశేషయ్య హృదయం పొంగిపోయింది. ఆయన, "పిచ్చితల్లీ, కళ్ళనీళ్ళు పెట్టుకోకు, నాపట్ల నీకున్న ప్రేమాదరాలు చూస్తూంటే, మరికొన్నేళ్ళపాటు బతగ్గల నన్న నమ్మకం కలుగుతున్నది," అంటూ చిన్నకూతురు తల నిమిరాడు.

ఆ తర్వాత ఆయన, పెద్దకూతుళ్ళిద్దరికీ ఆస్తిలో సగభాగం పంచి, పెళ్ళిళ్ళు చేసి, చిన్నకూతురు సరస్వతితో కాశీయాత్రకు వెళ్ళాడు.

ఆరు నెలల తర్వాత, ఆదిశేషయ్య కాశీ నుంచి తిరిగివచ్చి, సరస్వతికి తగిన వరుణ్ణి వెతికి వివాహంచేసి, అల్లుణ్ణి ఇల్లరికం తెచ్చుకుని, తన నగల వ్యాపారం అతడికి అప్పగించి, మరి కొన్నేళ్ళపాటు సుఖంగా జీవించాడు.



# నిధి

ఒకానొక అడవిదాపుల్లో, ఒక పేదరాలు నివసిస్తూండేది. ఆమెకు జోగులు అనే పదేళ్ళ కొడుకుండేవాడు. వాడు తల్లికి అడవిలో దొరికే కాయలూ, ఫలాలూ, మూలికలూ పోగుచేయడంలో సాయపడేవాడు. తల్లి వాటిని పొరుగునవున్న గ్రామాల్లో అమ్ముతూండేది. అలా వచ్చిన డబ్బే వాళ్ళ జీవనాధారం.

తల్లిపడే శ్రమ చూస్తూంటే, జోగులుకు చాలా బాధగా వుండేది. అడవిలో ఎక్కడైనా నిధిని సంపాయించి, దాన్ని తల్లికివ్వాలన్న ఆలోచన వచ్చింది వాడికి.

ఒక సాయంకాలం వాడు అడవిలో తిరుగుతూ, అలవాటుప్రకారం, "ఓ చెట్టూ, నీ వయసెంత ? ఓ పిట్టా, నీ పేరేమిటి ?" అని అడగసాగాడు.

ఒకచోట వాడికి వింతదుస్తులతో, తల మీద రకరకాల పూలతో అల్లిన కిరీటంతో వున్న పొట్టివాడొకడు కనిపించాడు. వాడు ఒక చెట్టునానుకుని నిలబడి ఏదో పాడుకుంటున్నాడు.

జోగులు వాణ్ణి సమీపించి, తన తల్లి పడే శ్రమ గురించి చెప్పి, "అమ్మకివ్వాలి. ఇక్కడెక్కడయినా నిధి వున్నదేమో తెలుసా ?" అని అడిగాడు.

అందుకు పొట్టివాడు బిగ్గరగా నవ్వి, "నిధా ? ఆ నిధి అమ్మకు ఏనాడో దొరికింది !" అంటూ గుబురుచెట్లల్లోకి పరుగుతీశాడు.

జోగులు ఇంటికి తిరిగివచ్చి, తల్లికి జరిగింది చెప్పి, "అమ్మా, ఆ నిధి సంగతి నాకెందుకు చెప్పలేదు ?" అని ప్రశ్నించాడు.

అందుకు వాడి తల్లి చిరునవ్వునవ్వి, "నాయనా, ఆ నిధివి నువ్వేరా !" అంటూ దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకున్నది.

—రావులపాటి ప్రసాద్






# 6

[మనోదర్పణంలో పూజారి అసలు స్వరూపాన్ని దర్శించిన జ్ఞానభూమి రాజు, ఆవేశంతో పూజారి తలను తెగవేశాడు. మనోదర్పణం ద్వారా, రాజు వినోదుడి మంచి మనసును గ్రహించి, విషవాయువులు చిమ్మే పర్వతశ్రేణులు దాటడానికి అతనికి అదృశ్యమయ్యే రహస్యం ఉపదేశించాడు. దానిని ప్రయోగించి వినోదుడు అదృశ్యమయ్యాడు. —తరవాత]

తను మాయమై, మళ్ళీ మామూలు మానవ రూపం ధరించిన విషయం తెలుసుకోవడానికి, వినోదుడికి కొంతసేపు పట్టింది. తానొక బండరాయిమీద పడి ఉన్నట్టు అతడు గ్రహించాడు, అతనికి కాళ్ళు చేతులు కదిలించలేనంత నీరసంగా ఉన్నది. మెల్లగా కళ్ళు తెరచి చుట్టు పక్కల కలయజూశాడు. అంతా చిమ్మ చీకటిగా ఉన్నది. ఎదురుగా ఒక ముని కూర్చొని ఉండడం లీలగా కనిపించింది. ముని కళ్ళు నీలమణుల్లా ప్రకాశిస్తున్నవి.

''భగవంతుడా, నేను మళ్ళీ మరొక పూజారికి పట్టుబడలేదు కదా!'' అనుకున్నాడు వినోదుడు.

''ఎవరు నువ్వు? శతాబ్దాల తరబడి మూయబడి వున్న ద్వారాన్ని దాటి, నా గుహలోపలికి ఎలా ప్రవేశించావు?'' అని అడిగాడు ముని ఆశ్చర్యంగా.

మనోజ్ దాస్



''శతాబ్దాల తరబడా! అంటే మీరు ఈ గుహలోనుంచి శతాబ్దాల తరబడి వెలుపలికి రాకుండా, ఈ గుహలోనే ఉంటున్నారా!'' అని అడిగాడు వినోదుడు లేచి కూర్చుంటూ, మరింత ఆశ్చర్యంగా.

''అవును. మరి నేను అడిగిన ప్రశ్నకు సమాధానం ఏమిటి?'' అన్నాడు ముని.

వినోదుడు తన వృత్తాంతాన్ని క్లుప్తంగా తెలియజేశాడు. అంతా విన్న ముని, కళ్ళు మూసుకుని, నిశ్చలంగా ధ్యానంలో కూర్చున్నాడు. గంటసేపు గడిచింది. ముని నెమ్మదిగా కళ్ళు తెరచి, వినోదుడి తలమీద చేయి వుంచి, ''నాయనా, నువ్వు పవిత్రస్వరూపుడివి. అందువల్లే అదృశ్యంగా పయనిస్తున్న నువ్వు, నాకేసి ఆకర్షింపబడి ఇక్కడికి చేరావు,'' అన్నాడు మందహాసంతో.

వినోదుడికి ఆనంద తటాకంలో మునిగినట్టయింది. అతని నీరసమంతా చిటికలో తొలగిపోయింది. శాంతి, ఆనందం నరనరానికి ప్రసరించినట్టయింది. ఆ ముని ఎంతో మహిమాన్వితుడనీ, దయాస్వరూపుడనీ వినోదుడు గ్రహించాడు.

''రా, వెలుపలికి పోదాం. కొత్త ప్రాంతాన్ని చూపుతాను. నేనూ చూసి చాలా కాలమయింది,'' అంటూ ముని లేచి ముందుకు నడిచాడు. ఇరువురూ గుహాముఖానికి చేరారు. ద్వారానికి అడ్డుగా ఉన్న బండను తొలగించడానికి వినోదుడు ప్రయత్నించాడు. కాని, వెంట్రుకవాసి కూడా కదిలించలేక పోయాడు.

''ఉండు, నేను తొలగిస్తాను.'' అంటూ ముని ఆ బండను దండంతో తాకాడు. బండ ఎగిరి దూరంగా పడింది. ఇద్దరూ గుహ నుంచి బయటకు వచ్చారు. గుహ కొండపైన ఉన్నది. కొండకు దిగువ భాగంలో ఒక అందమైన పట్టణం కనిపించింది!

''భగవంతుడా! గుహచుట్టూ ఉన్న అందమైన చెట్టుచేమలూ, పక్షులూ ఏమయ్యాయి? కొండచుట్టూ వున్న

అరణ్యమంతా ఎలా మాయమయింది ?''
అని ముని మనసులో అనుకుంటూ వినో
దుడి కేసి తిరిగి, ఆ ప్రాంత వృత్తాంతాన్ని
వివరించాడు:

ఆ ప్రాంతమంతా ఒకప్పుడు భయం
కరమైన అరణ్యంగా ఉండేది. ఆ ముని
తప్ప, మానవమాత్రులెవ్వరూ ఆ పరిసర
ప్రాంతాలలో ఉండేవారు కాదు. రాజు
పెట్టే బాధలు భరించలేక పేదవాడొకడు,
ఒకనాడు రాజ్యం నుంచి పారిపోయి, ఆ
కొండ ప్రాంతానికి చేరాడు. అతణ్ణి ఆకలి
దప్పులు విపరీతంగా బాధించసాగాయి.
అప్పుడతనికి పక్కనే ఉన్న చిన్న కొండ
మీద, కొన్ని పక్షులు కిలకిలమంటూ, ఒక
పుచ్చకాయను తింటూ కనిపించాయి.
అతడు వెంటనే కొండ మీదికి వెళ్ళి,
పక్షులు సగం తిని వదలి వెళ్ళిన పుచ్చ
కాయను అందుకుని ఆవురావురని తినే
శాడు. అతని ఆకలి దప్పులు తీరాయి.

ఆ తరవాత అతనికి ఒక అనుమానం
కలిగింది. ఇంతపెద్ద పుచ్చకాయను అంత
చిన్న పక్షులు ఎలా ఎత్తయిన ఈ కొండ
మీదకు మోసుకురాగలిగాయి? ఇలా
ఆలోచిస్తూ అతడు పరిసర ప్రాంతాలను
పరిశీలనగా చూశాడు. పక్కనే ఒక తీగ
కనిపించింది. ఆ కొండమీదే పుచ్చకాయ
కాచినట్టు గ్రహించి ఆశ్చర్యం చెందాడు.



''బండరాళ్ళతో ఉన్న ఈ కొండ మీద
పుచ్చకాయ ఎలా పండుతుంది? అని
ఆశ్చర్యపడుతున్నావా ?'' అంటూ
అక్కడికి వచ్చాడు, దాపులనున్న గుహలో
నుంచి ఒక ముని.

''అవును, స్వామీ!'' అన్నాడు పేద
వాడు.

''నేనే, నా యోగశక్తితో రోజు కొక
పుచ్చకాయను సృష్టించి, పక్షులకు ఆహా
రంగా పెడుతున్నాను,'' అన్నాడు ముని

''అలాగా! అయితే నన్ను కూడా ఒక
పక్షిగా మార్చేయండి, మహాత్మా! మీ దయ
వల్ల పుచ్చకాయను తిని బతికిపోతాను,''
అని ప్రార్థించాడు పేదవాడు.



''అంతెందుకుగాని, కావాలంటే నీకూ సరిపడా పుచ్చకాయను పెద్దదిగా సృష్టిస్తాను,'' అన్నాడు ముని.

''మహాప్రసాదం!'' అని పేదవాడు మునికి చేతులెత్తి నమస్కరించాడు. అయినా, అతని ముఖంలో విచారం కనిపించింది.

''నీ ఆకలి సమస్య తీరిందికదా! ఇంకా ఎందుకా విచారం?'' అని అడిగాడు ముని.

''ఇంత గొప్ప ఉపకారం చేసిన తమకు ఎలా కృతజ్ఞతలు తెలియజేయాలో తెలియడం లేదు. అది నా మొదటి విచారం; నా ఆకలి సమస్య తీరింది. కాని, నా కుటుంబం గతి ఏం కావాలి! అది నా రెండవ విచారం,'' అన్నాడు పేదవాడు.

''నీ కుటుంబాన్ని కూడా ఇక్కడికి తీసుకురా. వాళ్ళకూ సరిపోయేలా పుచ్చకాయను సృష్టిస్తాను,'' అన్నాడు ముని.

పేదవాడు తల వంచి నమస్కరించాడు. కాని, అతని ముఖంలో విచారం పోలేదు.

''ఇంకా ఎందుకు విచారిస్తున్నావు?'' అని అడిగాడు ముని మళ్ళీ.

''మీ దయవల్ల, నేనూ నా కుటుంబం, ఆకలిబాధ నుంచి బయటపడగలం. అయినా, ఇన్నాళ్ళు కలిసిమెలసి ఉన్న బంధుమిత్రులను ఎలా మరిచిపోగలను మహాత్మా!'' అన్నాడు పేదవాడు.

''అదా నీ విచారకారణం! నీ కుటుంబంతోపాటు, నీ బంధుమిత్రులందరినీ ఇక్కడికి తీసుకురా,'' అన్నాడు ముని.

''కరుణాస్వరూపా! నేను ఇక్కడికి తీసుకువచ్చే, నా కుటుంబమూ, బంధుమిత్రుల సంఖ్యా క్రమంగా పెరుగుతుంది కదా! అలా పెరిగే జనాభాకు ఒక్క పుచ్చకాయ ఎలా సరిపోగలదు, అన్నదే నా అనుమానం,'' అన్నాడు పేదవాడు.

ముని ఒక్కక్షణం మౌనం వహించి, ''నేను గుహలోకి వెళ్ళి తపస్సు చేసుకో

వాలనుకుంటున్నాను. నా తపస్సు ఎంత కాలం కొనసాగుతుందో, ఆ భగవంతుడికే ఎరుక. అయితే, నేను ఇక్కడ వదిలి వెళ్ళే యోగశక్తి ప్రభావం వల్ల, మీకు రోజూ ఒక పుచ్చకాయ లభ్యమవుతూనే ఉంటుంది. రోజూ సాయంకాలం, మీలో ఒకరు ఇక్కడికి వచ్చి, రేపు ఎంతమందికి సరిపడా పుచ్చకాయ కావాలో గట్టిగా చెప్పి వెళ్ళండి. మర్నాటి ఉదయానికల్లా కావలసినంత పరిమాణంలో పుచ్చకాయ ఈ తీగకు వేలాడుతూ వుంటుంది. దానిని మీరు పంచుకుని తినండి. దానిని భుజించినవారికి రోజల్లా ఆకలిదప్పులు ఉండవు," అన్నాడు.



పేదవాడు వెళ్ళి, తన భార్యాబిడ్డలనూ, బంధుమిత్రులనూ వెంటబెట్టుకుని వచ్చాడు. కొండపాదతలంలోని పచ్చిక మైదానంలో చిన్న గుడిసెలు వేశారు. ముని అక్కడ చేరినవారికి, "భగవంతుడి కరుణవల్ల మీకు ఆకలిసమస్య తీరింది. సత్యాన్ని సాధించడమే మానవ జీవిత లక్ష్యం. ఇప్పటి నుంచే మీ లక్ష్యసాధనకు పూనుకోండి," అని ఉపదేశించాడు.

వాళ్ళకు ధ్యానపద్ధతులు నేర్పించి, ముని కొండ మీది గుహలోపల ప్రవేశించి తపస్సు చేయడం ప్రారంభించాడు. శతాబ్దాలు గడిచిపోయాయి.

మునీశ్వరుడు చెప్పిన ఉదంతమంతా విన్న వినోదుడు, "మహాత్మా! ఇప్పుడు మన కళ్ళ ఎదుట కనిపించే పట్టణం, ఆనాటి శరణార్థుల వారసులు నిర్మించినదే అయివుంటుంది. గుహ ముఖద్వారంలో, నాకు పుచ్చతీగ కనిపించింది. ఇంకా వాళ్ళు పుచ్చకాయను తీసుకుంటూ ఉన్నా ఆశ్చర్యం లేదు," అన్నాడు.

"పట్టణంలో ప్రవేశించి, అక్కడి విశేషాలు తెలుసుకుందాం, రా," అంటూ ముందుకు నడిచాడు ముని.

వినోదుడు అయన్ను అనుసరించాడు. కొండపైనుంచి కిందికి ఉన్న బాటకిరువైపులా పూలచెట్లూ, తీగలూ ఉన్నాయి.



మునీ, వినోదుడూ కొంతసేపటికి కొండ పాదతలంలో ఉన్న పట్టణ ద్వారం దగ్గరికి చేరారు. రంగురంగుల తలపాగాలు ధరించిన, దృఢకాయులైన ఇద్దరు భటులు, శూలాలు పట్టుకుని ద్వారానికి కాపలా కాస్తున్నారు. ద్వారానికి వెలుపల గుంపుగా జనం ఉన్నారు.

''మేము దూరప్రాంతం నుంచి వచ్చిన యాత్రికులం. కొండ మీదికి వెళ్ళి చూడడానికి అనుమతించరా?'' అన్నాడు గుంపులో నుంచి ఒకడు.

''అనుమతించం. అద్భుతమైన పుచ్చకాయ లభించే ఈ కొండ మీదికి మా నాయకుడు మాత్రమే వెళ్ళడానికి అర్హుడు. ఆయన కూడా, ఎంతమందికి సరిపడా పుచ్చకాయ కావాలో అజ్ఞాపించడానికి, రోజుకు ఒక్కసారి మాత్రమే కొండపైకి వెళతాడు,'' అన్నారు భటులు.

భటుడి మాటలు విని, ''ఆ నాయకుడు, మొదట శరణార్థిగా వచ్చిన పేదవాడి సంతతివాడై వుంటాడు,'' అంటూ ముని ముందుకు నడిచాడు.

ఇరువురూ ద్వారం దాటి లోపలికి వెళ్ళారు.

''మనం లోపలికి వస్తున్నప్పటికీ భటులు ఆక్షేపించలేదేమిటి?'' అన్నాడు వినోదుడు ఆశ్చర్యంగా.

''మనం ఇప్పుడు అదృశ్యంగా నడుస్తున్నాము. మన మాటలు కూడా ఎవరికీ వినిపించవు,'' అన్నాడు ముని.

వినోదుడు అమితాశ్చర్యం చెందాడు.

వారిరువురూ ఒక వీధిగుండా వెళ్ళి, ముఖద్వారం మీది శిలాఫలకం మీద 'నిశ్శబ్దం' అని రాయబడి వున్న పెద్ద మంటపాన్ని చేరారు. కొందరు అధికారులు, చుట్టూ వున్న పచ్చికమైదానంలో అటూ ఇటూ పచార్లుచేస్తూ, అప్పుడప్పుడు మంటపం లోపలికి తొంగి చూస్తున్నారు.

''ఈ స్థలం నాకు జ్ఞాపకం ఉన్నది. ఆ కాలంలో ఇక్కడ పెద్ద తోట ఒకటి ఉండేది. ఇక్కడ ఏం చేయాలో కూడా

వాళ్ళకు వివరించి వెళ్ళాను. రా, ఇప్పుడేం చేస్తున్నారో చూద్దాం,'' అంటూ ముని మంటపం లోపలికి ప్రవేశించాడు.

వరుసగా వేయబడిన పడకకుర్చీ వంటి ఆసనాలలో, స్త్రీ పురుషులు చాలామంది పడుకుని నిద్రపోతున్నారు. కొందరు గాఢ నిద్రలో గట్టిగా గుర్రు పెడుతున్నారు. ఎవరెవరు ఎంతసేపు నిద్రపోయేదీ, అధికారులు లెక్కగడుతున్నారు. అక్కడి వాతావరణాన్ని పరిశీలించి చూశాక— మరీగట్టిగా గుర్రుపెట్టి నిద్రించినవారికి, ప్రోత్సాహం లభిస్తుందనీ, కొంతకాలం గడిచాక ఇదంతా లెక్కగట్టి, ఎక్కువ కాలం నిద్రించి, అందరికన్నా గట్టిగా గుర్రుపెట్టినవారికి సన్మానం చేస్తారనీ, ముని గ్రహించాడు.

ఆయన కోపావేశంతో, అక్కడ అదమరచి నిద్రపోతూన్నవాళ్ళను జుట్టుపట్టి లాగి కిందికి తోశాడు. వినోదుడు కూడా మునిని అనుసరించి అలాగే చేయసాగాడు. కొంతసేపటికల్లా, హఠాత్తుగా నిద్రలేచిన వారి కేకలతో మంటపమంతా అల్లకల్లోలమయింది. అధికారులు ఏం చేయడానికీ తోచక అలాగే ఉండిపోయారు.

ముని బయటకు వచ్చాడు. వినోదుడు ఆయన వెనక నడుస్తూ, ''మహాత్మా, వారి పట్ల మీ ఆగ్రహానికి కారణం తెలుసుకోవచ్చా,'' అని అడిగాడు.

''నేను వాళ్ళ పూర్వులకు కళ్ళు మూసుకుని ధ్యానం చేయడం ఎలాగో నేర్పి వెళ్ళాను. వాళ్ళేమో ధ్యానం మాట మరిచిపోయి, ఇప్పుడు నిద్రపోవడంలోనూ, గుర్రుపెట్టడంలోనూ ఒకరితో ఒకరుపోటీపడుతున్నారు,"అన్నాడుముని.

ఇరువురూ కొంతసేపటికి ఆలయం లాంటి కట్టడం ముందు చేరారు. ఆలయ ప్రాంగణంలో పట్టణ అధికారుల సభ జరుగుతున్నది. వాళ్ళలో యువకుడైన పట్టణ నాయకుడు కూడా ఉన్నాడు. వినోదుడూ, మునీ అదృశ్యంగా వాళ్ళ మధ్యకు చేరారు. ఆలయం తలుపులు మూయబడ్డాయి. —(ఇంకావుంది)






# పిల్లదయ్యం చదువు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, పిశాచాలూ, నక్కలూ, గుడ్లగూబలూ విచ్చలవిడిగా తిరిగే యీ శ్మశానంలో, ఒక రాజ్యానికి ఏలికవైన నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే నవ్వాలో, విచారపడాలో తెలియడంలేదు. నీ అంత పట్టుదలా, సహనశక్తీ గల ఒక పిల్లదయ్యం, ఒక బడిపంతులూ, తాము కోరినది సాధించాలన్న పట్టుదలతో బయలుదేరి, మధ్యలోనే వెనుదిరిగారు. ఏదో ఒకనాడు నువ్వూ అలా చేయగలవన్న అనుమానం కలుగుతున్నది. వాళ్ళ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను." అంటూ యిలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



నాగవరం అనే గ్రామంలో వుండే బడిపంతులు బలరామయ్య, ఒకరోజు భార్యమీద కోపంవచ్చి, ఇంట్లోంచి వెళ్ళిపోయి గ్రామం చివరవున్న చింతచెట్టు కింద కూర్చున్నాడు.

అప్పుడు చింతచెట్టుమీదినుంచి ఒక పిల్లదయ్యం ఆయన ముందు దూకి, ''భయపడకండి, పంతులుగారూ! మీ దగ్గిర చదువుకోవాలని వచ్చాను,'' అన్నది.

బలరామయ్య కంగారుపడి, ''ఎవరు నువ్వు? నీకు చదువెందుకు?'' అని అడిగాడు.

''నాకు చదువంటే ఎంతో యిష్టం. కానీ, నాకు చిన్నతనంలోనే నాన్న పోయాడు. అమ్మ కష్టపడి పనిచేసి నాకు తిండి పెట్టేది. అమ్మ కష్టం చాలడం లేదని, నేనూ పనిచేసి సంపాయించడం మొదలు పెట్టాను. నాకు చదువుకోవాలన్న కోరిక వుండడంవల్ల, సంపాదించిన డబ్బులో కొంత వేరే దాచేవాణ్ణి. ఉన్నట్టుండి అమ్మకు జబ్బు చేసింది. ఇంట్లో డబ్బంతా వైద్యానికి ఖర్చయి పోయింది. అమ్మ కూడా నాకు దక్కలేదు. దుఃఖం పట్టలేక నేను నదిలో దూకి ఆత్మహత్య చేసుకున్నాను. చదువుకోవాలన్న కోరిక వుండిపోవడంవల్ల, నేను దయ్యాన్నయ్యాను. మీరు కోరిన పని చేసిపెడతాను, నాకు చదువుచెప్పండి,'' అన్నది పిల్లదయ్యం.

''నాకు ఇప్పుడు డబ్బు కావాలి. నువు తెచ్చి పెట్టగలవా?'' అన్నాడు బలరామయ్య.

''ఎంతకావాలి?'' అని అడిగింది పిల్లదయ్యం.

''వెయ్యి బంగారు నాణాలు,'' అన్నాడు బలరామయ్య ఆశగా.

''అంత డబ్బు నాదగ్గరలేదు. రాజుగారి ఖజానాలోంచి దొంగతనంచేసి తెచ్చేదా?'' అన్నది పిల్లదయ్యం.

''నీ యిష్టం. నువ్వెలా తెచ్చినాసరే!'' అన్నాడు బలరామయ్య.

"సరే. డబ్బు తేగానే నాకు చదువు చెబుతారా?" అన్నది పిల్లదయ్యం.

"మరొకపని చెయ్యాలి! నా భార్య నిత్యం గొడవలతో, నాకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నది. నువ్వు దాన్ని భయపెట్టి, నా మాట వినేలా చేయాలి," అన్నాడు బలరామయ్య.

"అలాగే చేస్తాను. మరి నాకు చదువు చెబుతారా?" అని అడిగింది పిల్లదయ్యం.

బలరామయ్య, దయ్యం చేయవలసిన మరికొన్ని పనులు చెప్పాడు.

బలరామయ్య గ్రామంలో, ఒక పెద్దమనిషి దగ్గర అప్పుచేశాడు. ఏడాది గడిచాక బాకీ తీర్చేశాడు. ఆ పెద్దమనిషి బాకీ తీర్చలేదంటున్నాడు. అప్పు తీర్చినట్టుగా బలరామయ్యకు సాక్ష్యంలేదు. అందువల్ల కొందరు బలరామయ్యను అనుమానిస్తే, కొందరు పెద్దమనిషిని అనుమానించారు.

పిల్లదయ్యం పెద్దమనిషికి పూని, గ్రామంలో అందరికీ నిజం చెప్పాలి! అందువల్ల, బలరామయ్య పరమ నిష్ఠా గరిష్ఠుడనీ, ఆ కారణంగా ఆయనకు అద్భుత శక్తులు వచ్చాయనీ గ్రామంలో ప్రచారమవుతుంది. ఆయన అద్భుత శక్తులు ప్రదర్శించడానికి పిల్లదయ్యం సహకరిస్తుంది!



చదువుమీది ఆశకొద్దీ పిల్లదయ్యం, బలరామయ్య పెట్టిన షరతులకన్నిటికీ ఒప్పుకున్నది. కొద్దిరోజుల్లోనే బలరామయ్య జాతకం మారిపోయింది.

ఆయన ఇంట్లో వెయ్యి బంగారు నాణాలు చేరాయి. భార్య చెప్పిన మాట వింటున్నది. ఊళ్ళో బాకీ తీర్చలేదన్న పెద్దమనిషి తన తప్పొప్పుకున్నాడు. బలరామయ్య అద్భుతశక్తులు ప్రదర్శించసాగాడు.

క్రమంగా ఆయన ఇంటికివచ్చే భక్తుల సంఖ్య పెరిగిపోసాగింది. వాళ్ళిచ్చే కట్నకానుకలతో బలరామయ్య సంపన్నుడయ్యాడు. ఆయన యిప్పుడు గాలిలో



తేలిపోగలడు. నీటిపై నడవగలడు. గాలిలోంచి వస్తువులను సృష్టించగలడు. ఎక్కడెక్కడి రహస్యాలనూ తెలుసుకుని చెప్పగలడు. ఆయన్ని చూట్టానికి, ఆదేశపు రాజుకూడా వచ్చివెళ్ళాడు.

ఇన్ని జరిగినా బలరామయ్య, పిల్ల దయ్యానికి చదువు చెప్పలేదు. అసలాయన క్రమంగా పిల్లలకు చదువు చెప్పడమే మానేశాడు.

తనకు చదువెప్పుడు చెబుతావని పిల్ల దయ్యం ప్రతిరోజూ, ఆయన్ని వేధించేది. ఆయన దానితో, "నీ కారణంగా నేనిప్పుడు తీరుబడిలేని మనిషినయ్యాను. అందువల్లనే వున్న శిష్యులను కూడా వదులుకున్నాను. ఇక నీకెలా చదువు చెప్పేది?" అనేవాడు.

"నేను మీరు కోరినవన్నీ చేశాను. నాకు చదువు చెప్పకపోతే, మీరు నన్ను మోసగించినట్టేగదా?" అన్నది పిల్ల దయ్యం.

అందుకు బలరామయ్య, "నీకు చదువెందుకు? నా కారణంగా నీకు పూజలు జరుగుతున్నాయి. నాకు లభించే గౌరవమంతా కూడా నీదే! చదువుకున్న నాకు చదువేమీ గౌరవాన్నివ్వలేకపోయింది. చదువులేని నీ కారణంగానే, నాకు గౌరవం లభించింది. చదువు అద్భుతశక్తుల నివ్వదు. కానీ చదువుకున్నవాళ్ళు కూడా, అద్భుతశక్తులున్నవారినే అనాలోచితంగా గౌరవిస్తారు. కాబట్టి నువ్వు చదువు గురించి మరిచిపోయి హాయిగా వుంటూ గౌరవాలు పొందు," అన్నాడు.

"నాకు గౌరవం వద్దు, చదువు కావాలి!" అన్నది పిల్లదయ్యం.

"నన్ను క్షమించు. నేను నీకు చదువు చెప్పలేను," అన్నాడు బలరామయ్య.

"ఎందుకు చెప్పలేరో చెప్పండి. సమాధానం తృప్తికరంగా లేకపోతే నేను మిమ్మల్నీ మీ కుటుంబాన్నీ సర్వనాశనం చేసి మరీ వెళ్ళిపోతాను." అన్నది పిల్ల దయ్యం.

బలరామయ్య ఒకటి, రెండు క్షణాలు మౌనంగా వూరుకుని, "నువ్వు నన్నేం చేసినా ఫర్వాలేదు. నేను నిజం చెబుతాను విను. నా చదువు నాకు గౌరవాన్నీ, విలువనూ తెచ్చిపెట్టలేదు. అందువల్ల నాలో కీర్తికాంక్ష, ధనకాంక్ష పెరిగిపోయాయి. చదువుకోసం నన్ను వేడుకున్న నిన్ను; దొంగతనానికీ, జీవహింసకూ, మోసానికీ, అబద్ధానికీ ప్రోత్సహించి నా కోర్కెలు తీర్చుకున్నాను. నీకు చదువు చెబితే అవన్నీ తప్పని చెప్పాలి. నేను చెప్పి చేయించిన పనులు తప్పని చెప్పే అర్హత నాకు లేదు. అందుకే నేను నీకేకాదు, యికపై ఎవరికీ కూడా చదువు చెప్పకూడదని నిర్ణయించుకున్నాను," అన్నాడు.

పిల్లదయ్యం, బలరామయ్య కేసి, ఒక క్షణకాలం జాలిగా చూసి అక్కణ్ణించి మాయమైపోయింది.

తర్వాత బలరామయ్య ఊరివాళ్ళందర్నీ పిలిచి, "నా అద్భుతశక్తులవల్ల చూసేవారికి వినోదమే తప్ప, ప్రపంచానికి ఎలాంటి ప్రయోజనమూ లేదు. నా శక్తులు నాకు పేరు తెచ్చిపెట్టాయి. కానీ నాకు కీర్తికాంక్షలేదు. నా అద్భుశక్తులను ప్రపంచక్షేమానికై త్యాగం చేసి, నేను సామాన్యుడిగా వుండి పోదల్చుకున్నాను!" అని చెప్పాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, యిక్కడ నాకొక సందేహం కలుగుతున్నది. పిల్లదయ్యం, తనకు బలరామయ్య



చెప్పే సమాధానం తృప్తికరంగా లేకపోతే, అతణ్ణి సర్వనాశనం చేస్తానన్నది. మరి, బలరామయ్య చెప్పిన సమాధానం దానికి తృప్తి కలిగించినట్టేనా? అతడి కేసి అది జాలిగా ఎందుకు చూసింది? బలరామయ్య తన అద్భుతశక్తులను త్యాగం చేసి, సామాన్యుడిగా వుండిపోతానని చెప్పిన మాటలో నిజాయితీ వున్నదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''పిల్లదయ్యం, బలరామయ్య కేసి జాలిగా చూడడానికి ముఖ్యమైన కారణమే వున్నది. అతడు చదువుకుని ఏవైతే తప్పులని తెలుసుకున్నాడో, ఆ తప్పులే పిల్లదయ్యంచేత చేయించాడు. ఆ మాట అతడే ఒప్పుకోవడం జరిగింది. అతడు చదివినచదువు, అతడి మీద ఎలాంటి ప్రభావమూ చూపలేదు. అంటే—అతడు చెప్పే చదువు కూడా, అతడి శిష్యుల మీద ఎలాంటి ప్రభావమూ చూపలేదని తేలిపోయింది. ఇది గ్రహించిన పిల్లదయ్యానికి చదువంటేనే విరక్తి కలిగి, అతడి కేసి జాలిగా చూసింది. బలరామయ్య చెప్పింది దానికి తృప్తి కలిగించినా కలిగించకపోయినా, అతడు వాస్తవం చెప్పాడని పిల్లదయ్యానికి తెలుసు. అందుకే, అది అతడికి ఎటువంటి హానీ కలిగించకుండా మాయమైంది.

''బలరామయ్య, తన అద్భుతశక్తులను ప్రపంచక్షేమం కోసం త్యాగం చేస్తున్నట్టు, ఊరందరికీ చెప్పడం పెద్ద అబద్ధం. పిల్లదయ్యం సాయం లేకపోయాక, అతడికి ఎలానూ అద్భుతశక్తులుండవు. ఆ రహస్యం బయటపడకుండా వుండేందుకు అతడు ఊరివాళ్ళతో, ఏదో త్యాగం చేస్తున్నట్టు అబద్ధాలుపలికి, వాళ్ళచేత నమ్మించాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# రాజు - చండాలుడు

పూర్వం ఉత్కళదేశాన్ని పురుషోత్తమదేవుడు అనే రాజు పాలించేవాడు. ఆయన గొప్ప జగన్నాథ భక్తుడు. రాజ్యం జగన్నాథుడిదేననీ, తాను ఆ దేవుడి సేవకుడుగా రాజ్యపాలన చేస్తున్నాననీ ఆయన నమ్మేవాడు.

పూరిలో ఏటా ఆషాఢమాసంలో రథయాత్ర జరుగుతుంది. ఆ ఉత్సవానికి వేలాది జనం వస్తారు. రథయాత్రలో పాల్గొనే మూడు రథాల కింద రాజు స్వయంగా చీపురుకట్టతో ఊడ్చేవాడు. తరవాతనే రథాలను ప్రజలు లాగేవారు.

పురుషోత్తముడు ఒకసారి దక్షిణ దిగ్విజయానికి వెళ్ళి, కంచి రాజు కూతురైన పద్మావతిని చూశాడు. ఆమె అసాధారణ సౌందర్యవతి. ఆమెను చూడగానే పురుషోత్తముడు ఇష్టపడి, పెళ్ళాడ నిశ్చయించాడు. ఈ విషయం దూత ద్వారా విని, పద్మావతి తండ్రి వివాహానికి సమ్మతించాడు. పురుషోత్తముడి ఆహ్వానంమీద ఆయన ఉత్కళ దేశానికి పోవటమేగాక, రథోత్సవాన్ని కూడా కళ్ళారా చూతామనుకున్నాడు.

రథోత్సవంనాడు, దేవాలయంనుంచి ఉద్యానభవనం దాకా ఉన్న వీధి అంతా జనంతో నిండిపోయింది. శంఖాలు మోగుతున్నాయి. జనం కోలాహలం చేస్తున్నారు. దేవాలయం నుంచి జగన్నాథ, బలభద్ర, సుభద్రల విగ్రహాలను తెచ్చి, మూడు రథాలలోనూ ఉంచారు.

అంతదాకా కంచి రాజుతో కబుర్లు చెబుతున్న పురుషోత్తముడు లేచివెళ్ళి రథాలకింద చీపురుకట్టతో ఊడ్చాడు. ప్రజలు హర్షధ్వానాలు చేశారు.

పురుషోత్తముడు చీపురుకట్ట తీసుకుని ఊడవటం చూసి, కంచిరాజుకు రోత

ఉత్కళ జానపద కథ

పుట్టింది. రథయాత్ర ముగియగానే ఆయన కంచికి తిరిగివెళ్ళి, "నా కుమార్తెను చండాలుడికి ఇచ్చి పెళ్ళి చెయ్యను," అని ఉత్కళరాజైన పురుషోత్తముడికి కబురుచేశాడు.

పురుషోత్తముడికి పట్టరాని కోపం వచ్చింది. ఆయన కంచి రాజ్యంమీద యుద్ధం ప్రకటించి, దండెత్తి వెళ్ళాడు. తరువాత జరిగిన యుద్ధంలో పురుషోత్తముడికి విజయం లభించింది. రాజకుమార్తె పద్మావతి అతనికి బందీగా చిక్కింది.

అయితే పురుషోత్తముడికి ఇప్పుడు ఆమెను పెళ్ళాడాలన్న కోరిక లేదు. ఆయన తన మంత్రిని పిలిచి, "ఈమె తండ్రి నన్ను చండాలుడు అన్నాడు. ఈమెను కసువు ఊడ్చే వాడికిచ్చి పెళ్ళి చెయ్యండి," అని ఆజ్ఞాపించాడు.

"చిత్తం మహారాజా! అలాగే చేస్తాను," అన్నాడు మంత్రి.

కాని, జాలిగుండె గల ఆ మంత్రి అలా చెయ్యలేదు. ఆయన పద్మావతిని తన ఇంటికి చేర్చాడు. అక్కడ మంత్రీ, ఆయన భార్యా, పద్మావతిని తమ సొంత కూతురులాగే చూసుకుంటూ, తమ ఇంట రహస్యంగా ఉంచారు.

కొద్ది నెలల అనంతరం తిరిగి రథోత్సవం వచ్చింది. రాజు తన ఆచారం ప్రకారం చీపురుకట్ట తీసుకుని, రథాల కింద ఊడుస్తున్నాడు.

ఆ సమయంలో మంత్రి పద్మావతిని తీసుకుపోయి, "మహారాజా, మీ ఆజ్ఞ నెరవేర్చటంలో జాప్యం జరిగినందుకు క్షమించండి. ఈ పిల్లకు ఊడ్చే భర్త మీ కన్న యోగ్యుడు దొరకడు. దయచేసి ఈమెను పెళ్ళాడండి," అన్నాడు.

అప్పటికి పురుషోత్తముడి ఆగ్రహం చల్లారిపోయింది. తన మంత్రి చేసిన యుక్తికి సంతోషించి, మహా వైభవంగా పద్మావతిని వివాహం చేసుకున్నాడు.

వారి సంతతి ఇప్పటికీ పూరీ రథోత్సవం నాడు చీపురుకట్ట తీసుకుని దేవాలయం ఊడుస్తారు.





కావ్యకథలు :

# శకుంతల–3

దుర్వాసముని శాపకారణంగా, దుష్యం తుడు తనను మరిచిపోవడంతో, ఖిన్నురాలయిన శకుంతలను తల్లి మేనక ఓదార్చి, ఒక ఆశ్రమంలో చేర్చింది. ఆమె అక్కడ మగశిశువును కని, భరతుడు అని నామకరణం చేసి అల్లారు ముద్దుగా పెంచసాగింది.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఒక నాడు ఒక బెస్తవాడికి నదిలో ఎంత సేపటికీ చేపలు దొరకలేదు. ఆఖరికి అతని వలలో ఒక పెద్ద చేప పడింది. అతడు చేపలు పట్టడం చాలించి, సంతోషంతో ఇంటికి చేరాడు.





బెస్తవాడు చేపను భార్య చేతికిచ్చి, వంట చేయమన్నాడు. ఆమె చేపను కోయగా చేప కడుపులో నుంచి, ఒక ఉంగరం బయటపడింది. దానిని చూసి పరమానందం చెంది, వాళ్ళు మంచి ధరకు అమ్మడానికి నిశ్చయించారు.



బెస్తవాడు ఆ ఉంగరాన్ని ఒక స్వర్ణ
కారుడి దగ్గరికి తీసుకుపోయి అమ్మ
చూపాడు. స్వర్ణకారుడు ఆ ఉంగరాన్ని
పరిశీలనగా చూసి, అది చేప కడుపులో
దొరికిందన్న సంగతిని నమ్మలేక
పోయాడు.

స్వర్ణ కారుడు ఉంగరంతోపాటు, బెస్త
వాణ్ణి కూడా దుష్యంతరాజు సమక్షానికి
తీసుకుపోయాడు. బెస్తవాడు ఆ ఉంగ
రాన్ని రాజమందిరం నుంచి దొంగి
లించి వుండవచ్చని అధికారులు భావిం
చారు. రాజు ఉంగరాన్ని పరిశీలనగా
చూశాడు.





రాజు ఆ ఉంగరాన్ని చూడగానే,
శకుంతల ఉదంతమంతా ఆయన మన
సులో మెరుపులా మెరిసింది. దుర్వాస
ముని శాపప్రభావం తొలగిపోయింది.
బెస్తవాడికి బహుమతి ఇచ్చిపంపాడు.
తను శకుంతలకు చేసిన అపకారం
తలుచుకుని రాజు చెప్పలేనంతగా బాధ
పడసాగాడు.

శకుంతల కణ్వముని ఆశ్రమంలో ఉండేమోనని, దుష్యంతుడు తన దూతలను అక్కడికి పంపాడు. ఆమె అక్కడ లేదు. ఆమె జాడ తెలుసుకోవడానికి, రాజు, నలుదిశలకూ భటులను పంపాడు.





ఎంత గాలించినా శకుంతల జాడ తెలియకపోయేసరికి రాజు విచారగ్రస్తుడయ్యాడు. ఆయన ఒకనాడు అరణ్యంలో సంచరిస్తూ ఉండగా, పిల్లవాడొకడు సింహపు కొదమలతో ఆడుకోవడం కనిపించింది. ఆ దృశ్యం చూసి ఆయన అమితాశ్చర్యం చెందాడు.

రాజు గుర్రం దిగి, కుర్రవాణ్ణి చేరదీసి, పలకరించాడు. పసివాడి ముద్దుమాటలు విని రాజు పరమానందం చెందాడు. ఆ కుర్రవాడు, కొంతసేపటికి రాజును చేయి పట్టుకుని తమ నివాసానికి తీసుకుపోయాడు.





తన కుమారుడు భరతుడు. తండ్రి గారయిన దుష్యంత మహారాజును చేయి పట్టుకుని తన ఆశ్రమం ముంగిట నిలబడడం చూసి, శకుంతల ఒక క్షణం నమ్మలేకపోయింది. ఆ తరవాత ఎంతో విలపించింది. కొంతసేపటికి, దుర్వాస ముని శాపకారణంగానే రాజు తనను మరిచిపోయాడన్న విషయం గ్రహించింది.

రాజమర్యాదలతో శకుంతల రాజధానీ నగరమైన హస్తినాపురానికి తీసుకురాబడింది; రాణిగా పట్టాభిషిక్తురాలయింది. శకుంతల తనను చేరడంతో, దుష్యంతుడి జీవితంలో మళ్ళీ ఆనందం వెల్లివిరిసింది. ఆయన ప్రజానురంజకంగా ధర్మపరిపాలన సాగించాడు.





తండ్రి అనంతరం భరతుడు రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించి గొప్ప పరిపాలనా దక్షుడుగా పేరుగాంచాడు. దేశంలోని రాజులందరూ ఆయన్ను తమ చక్రవర్తిగా అభిమానించి గౌరవించారు. భరతుడు పాలించడంవల్లే మన దేశానికి భారతదేశం అన్న పేరు వచ్చిందని చెబుతారు! —(అయిపోయింది)



# ముసలమ్మ యుక్తి

పూర్వం ఒక గ్రామంలో సీతారామయ్య అనే ఒక పండితుడుండేవాడు. ఆయన ఊరి పిల్లలకు చదువు సంధ్యలు నేర్పి గురుదక్షిణలు పొంది, అయిదువందల రూపాయలు వెనక వేసుకున్నాడు.

ఇంతలో కాశీలో ఒక విద్వత్సభ జరిగింది. సీతారామయ్యకు కూడా పిలుపు వచ్చింది. తన దగ్గిర నిలవ ఉన్న డబ్బు ఎవరి దగ్గిర దాచి ఉంచాలా అన్న సమస్య సీతారామయ్యకు ఏర్పడింది. ఇంటి దగ్గిరే ఉంచుదామంటే భార్య ససేమిరా వద్దన్నది. "సొమ్ము భయంకరమైనది. దానికి నేను కుక్క కాపలా కాయలేను. ఏ రాత్రివేళో దొంగలు వచ్చిపడి నా ప్రాణాలు తీసేస్తారు," అన్నదావిడ.

ఎక్కడ దాస్తే సొమ్ము భద్రంగా ఉంటుందా అనుకుంటూ సీతారామయ్య కోటయ్య అంగడికి వెళ్ళాడు. తనకు ఏర్పడిన సమస్య గురించి కోటయ్యకు చెప్పి, "నీ సలహా ఏమిటి? ఈ డబ్బు ఎవరి దగ్గిర దాచి పెడితే క్షేమమంటావు?" అని అడిగాడు.

"బాబూ, డబ్బు దగ్గిర ఆ బ్రహ్మదేవుణ్ణయినా నమ్మవద్దు. అది మహా పాపిష్టిది," అన్నాడు కోటయ్య.

వీరిద్దరూ మాట్లాడుతూండే సమయంలో అంగడి గుమాస్తా, ఒక స్త్రీకి నెయ్యి తూచి ఇచ్చి డబ్బు తీసుకుని పంపేశాడు.

కోటయ్య ఈ అమ్మకం వివరాలు కనుక్కొని, "ఓరి పాపిష్టివాడా, ఆ మనిషి దగ్గిర నాలుగు దమ్మిడీలు అధికంగా పుచ్చుకున్నావు. మనకు న్యాయంగా రావలిసిన లాభం ఒక్క దమ్మిడీ అయితే అయిదు దమ్మిడీలు లాభం పట్టావు. నీకెన్నిమార్లు చెప్పినా నీ బుద్ధి మారదు.



జ్ఞాపకం ఉంచుకుని ఆ మనిషి ఇంకోసారి బేరానికి వచ్చినప్పుడు ఆ నాలుగు దమ్మిడీలూ వాపసు ఇచ్చెయ్యి,'' అని గుమాస్తాను కసిరాడు.

ఈ సంఘటనతో సీతారామయ్యకు కోటయ్య మీద గురి ఏర్పడింది. ఆయన అంగడిలో తనకు కావలిసిన సరుకులు తీసుకుని, ఇంటికి వెళ్ళి తన అయిదు వందల రూపాయలూ మూట గట్టి తెచ్చి, ''ఇదుగో, కోటయ్యా! ఇదే నా డబ్బు. నేను కాశీనుంచి తిరిగి వచ్చేదాకా దీన్ని దాచి ఉంచే భారం నీదే!'' అన్నాడు.

''అమ్మయ్యో, నేనా డబ్బును తాకనైనా తాకను. కావలిస్తే మీరే మా ఇంట మీ యిష్టం వచ్చిన చోట గొయ్యి తీసి డబ్బు పాతేసి వెళ్ళండి. తిరిగి వచ్చినాక తవ్వి తీసుకోవచ్చు,'' అన్నాడు కోటయ్య.

''నిజంగా కోటయ్య ఎంత మంచి వాడు!'' అనుకుని సీతారామయ్య తన సొమ్ము ఒక చోట గుర్తుగా పాతిపెట్టి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఆయన కాశికి వెళ్ళి విద్వత్సభలో పాల్గొని, కొన్నాళ్ళకు స్వగ్రామానికి తిరిగి వస్తూనే కోటయ్య ఇంటికి వెళ్ళి, అతనితో, ''నా సొమ్ము నేను తీసుకుపోతాను,'' అన్నాడు.

''మహరాజుగా తీసుకు వెళ్ళండి. ఎక్కడ పాతిపెట్టారో గుర్తుందిగదా?'' అన్నాడు కోటయ్య.

కాని, సీతారామయ్య తవ్వి చూస్తే, ఉండవలిసిన చోట డబ్బు లేదు. సొమ్ము కనిపించలేదని అంటే కోటయ్య, ''దాని సంగతి మీకు తెలియాలి గాని నాకేం తెలుస్తుంది, బాబూ!'' అనేశాడు.

మోసం జరిగిపోయిందని గ్రహించి సీతారామయ్య కుంగిపోయిన మనస్సుతో ఇంటి దారిపట్టాడు.

దారిలో సీతారామయ్యకు శేషమ్మ అనే ముసలావిడ ఎదురుపడి, ''ఎప్పుడు వచ్చావు, నాయనా? అలా విచారంగా ఉన్నావేం?'' అన్నది.

సీతారామయ్య ముసలమ్మకు జరిగిన దంతా చెప్పాడు. శేషమ్మ కొంచెంసేపు ఆలోచించి, ''నాయనా, నీ సొమ్ము యావత్తూ కోటయ్య చేత కక్కిస్తాను. నేను చెప్పినట్టు చెయ్యి.'' అంటూ ఒక ఉపాయం చెప్పింది.

సీతారామయ్య ఆమె చెప్పినట్టు చెయ్యటానికి సిద్ధపడ్డాడు.

ఇది జరిగిన కొద్దిసేపటికే ముసలమ్మ రెండువేల రూపాయలు ఖరీదు చేసే నగలు పట్టుకుని కోటయ్యవద్దకు వెళ్లింది. ఆమె కోటయ్యతో, ''చూడు నాయనా! నా కొడుకు పదేళ్ళక్రితం చదువుకోసం కాశికి వెళ్ళాడు. ఇంతవరకు వాడి జాడ లేదు. నేనా పెద్దదాన్నయిపోయాను. ఎప్పుడు చస్తానో తెలియదు. అందుచేత కాశికి వెళ్ళి నా కొడుకు జాడ తెలుసుకుందామని తీర్మానించుకున్నాను. నేను ఒంటరిదాన్ని. నా దగ్గిర రెండు వేలు చేసే ఈ నగలున్నాయి. వీటిని వెంట తీసుకుపోతే దొంగలు దోచేస్తారు. నువు ధర్మాత్ముడవనీ, మన ఊరి సీతారామయ్య కూడా కాశీ వెళ్ళేటప్పుడు తన సొత్తు నీ దగ్గిరే దాచబెట్టాడనీ, ఇతరుల సొమ్మును నీవు మట్టితో సమంగా చూస్తావనీ అన్నారు. అందుచేత ఈ సొమ్ములు నేను తిరిగి వచ్చేదాకా నీ దగ్గిర దాచి ఉంచు, బాబూ!'' అన్నది.

కోటయ్య తన పంట పండిందనుకున్నాడు. లోలోపల ఎంతగానో సంబర



పడిపోయాడు. సీతారామయ్య తిరిగివచ్చిన సంగతి కూడా ముసలమ్మ కింకా తెలియ లేదనుకున్నాడు. ఆయన ఆవిడతో, "అమ్మా, మీ నగలు మీ చేత్తోనే మీ యిష్టం వచ్చిన చోట పాతి పెట్టుకోండి," అన్నాడు.

ఇంతలోనే సీతారామయ్య అక్కడికి వచ్చి, "చూడు కోటయ్యా, నేను సొమ్ము పాతిపెట్టిన చోటు గురించి పొరబడ్డాను. అసలు చోటు ఇప్పుడు నాకు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది. అక్కడ తవ్వుకుంటాను," అన్నాడు.

కోటయ్య గుండె గుబుక్కుమన్నది. సీతారామయ్య పాతిపెట్టిన అయిదు వందలూ తాను స్వాహా చేసినట్టు తెలిస్తే ముసలమ్మ తన రెండు వేల రూపాయల నగలూ తన ఇంట దాచిపెట్టదు. అందు చేత కోటయ్య, "మీకు కలిగిన సందేహమే నాకూ కలిగి మరో చోట తవ్వి చూశాను. మీ మూట చెక్కుచెదరకుండా దొరికి పోయింది," అంటూ లోపలికి వెళ్ళి సీతారామయ్య మూట తెచ్చి అతని చేతి కిచ్చేశాడు.

ఇది జరగగానే ముసలమ్మ సీతారామయ్య కేసి కొంతసేపు పరకాయించి చూసి, "ఎవరూ? సీతారామయ్యేనా? నువ్వు కాశీ నుంచి ఎప్పుడొచ్చావు, నాయనా? చూడూ, అక్కడ మా అబ్బాయి గాని నీకు కనిపించాడా?" అని అడిగింది.

సీతారామయ్య ఆమెతో, "ఇంతకు ముందే చేరుకున్నాను. కాశీలో మీవాడు కనిపించాడు. నాకు రెండు రోజులు వెనకగా బయలుదేరుతున్నాననీ, మిమ్మల్ని బెంగపడవద్దనీ చెప్పాడు!" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"అమ్మయ్య, బతికించావు! అయితే మరి నేను కాశీ వెళ్ళవలిసిన అవసరం లేదన్నమాటే!" అంటూ ముసలమ్మ సీతారామయ్యతో సహా బయలుదేరింది. జరిగినది చూసి కోటయ్య నిర్ఘాంత పోయాడు.





# కృష్ణావతారం

ఆయేడు చక్కని వర్షాలు కురిశాయి. పశువులూ, వాటి దూడలూ చక్కగా నవనవలాడుతూ తయారయాయి. పంటలు బాగా పండాయి. గడ్డీ, లతలూ, చెట్లూ సమృద్ధిగా పెరిగాయి. పాడీ, పంటా ఎన్నడూ లేనంత బాగా గోకులానికి లభించాయి.

వానలు వెనకపట్టి శరత్కాలం వచ్చింది. నందగోపుడు మొదలుగా గల పెద్దలు తమలో తాము మాట్లాడుకుని ఇంద్రోత్సవం చేద్దామని నిశ్చయించుకున్నారు. అనుకోవటమేమిటి, మరుక్షణమే అందుకు ప్రయత్నాలు కూడా ప్రారంభమయాయి. అందరూ హడావుడిగా తిరగసాగారు.

కృష్ణుడీ హడావుడి చూసి నవ్వుతూ గోపకులతో, "మీరంతా ఎందుకింత సంభ్రమంలో ఉన్నారు? ఏం పండగ ఇది? ఏ దేవుణ్ణి కొలవబోతున్నారు? ఆ దేవుడివల్ల మీకు కలిగే లాభాలేవి?" అన్నాడు.

గోపకులలో అతి వృద్ధుడైనవాడు కృష్ణుడితో, "బాబూ, లోకపాలకులందరికీ ఇంద్రుడు రాజు గదా. వర్షర్తువు అతనిదేనాయె. గోగణాలకు మేలుచేసే ఆ దేవుడు గోపకులకు ఎంతైనా కొలవదగిన దేవుడు. అందుచేత ఇంద్రోత్సవం తలపెట్టాం," అని చెప్పాడు.

అది విని కృష్ణుడిలా అన్నాడు: "మనుష్యులకుండే వృత్తులు మూడు.

8. గోవర్ధనోద్ధరణ



అవేవంటే వ్యవసాయమూ, వర్తకమూ, పశుపోషణా. ఎవరే వృత్తి చేస్తే వారి కదే దేవుడు. మనం గోపాలకులం; అడవులలో ఉంటాం. కొండల్లో తిరుగుతాం, పశువులను పెంచుతూ జీవిస్తాం. అందుచేత మనకు అడవులూ, కొండలూ, పశువులూ దేవతలు. ఎవరి కులదేవతలను వాళ్ళు పూజించాలి. కర్షకులు గ్రామాలలో నివసిస్తారు, ఆటవికులు అరణ్యంలో నివసిస్తారు, మనం కొండలలో నివసిస్తాం. బ్రాహ్మణులు మంత్రయజ్ఞం చేస్తారు; కర్షకులు నాగలి యజ్ఞం చేస్తారు; గోపాలకులు కొండ యజ్ఞం చేస్తారు. అందుచేత మనం పర్వతోత్సవం జరపటం యుక్తంగా ఉంటుంది. నేను చెప్పినట్టు చెయ్యక పోయారో బలాత్కారంగానైనా మీచేత చేయిస్తాను.''

ఈ విధంగా కృష్ణుడు చాలా సేపు బోధించిన మీదట అతను చెప్పినది మిగిలిన వాళ్ళకు నచ్చింది. అదీ గాక వాళ్ళు పూర్తిగా కృష్ణుడి పైన ఆధారపడి, అతనే తమకు అన్నింటికీ దిక్కన్న ధోరణిలో ఉన్నారు. ఎందుకంటే, అతను చేసిన అద్భుతాలు అన్నీ ఇన్నీ కావు. వాటికి తోడు అతను వాళ్ళను ఎన్నోసార్లు ఆపదల నుంచి కాపాడాడు. వాళ్ళ పాలిటికి అతను మనిషి కాదు, దేవుడు.

గోపాలకులు ఇంద్రోత్సవం మానేసి, బ్రాహ్మణులను పిలిపించి గిరియజ్ఞోత్సవానికి తగిన ఏర్పాట్లు చేశారు. పాయసాలూ, అపూపాలూ, ఉండ్రాళ్ళూ మొదలైనవి తయారయాయి. రకరకాల అన్నాలూ, మాంసాలూ, మధువులూ, పచ్చళ్ళూ, పెరుగూ, నెయ్యీ, మొదలైనవి కావళ్ళలోనూ, బళ్ళ మీదా ఎక్కించారు. ఆబాలగోపాలంగా గోపికలూ, గోపకులూ వాద్యాలతో సహా వృద్ధ గోపకుల వెంబడి, గోవర్ధన పర్వతానికి జాతరచేస్తూ ఉత్సాహంగా బయులుదేరారు.

గోవర్ధనగిరి సమీపంలో ఒక మంచి స్థలంలో పేడతో అలికి, అందంగా ముగ్గులు

పెట్టి ఉన్నతస్థలాన, కృష్ణుడి అధ్వర్యాన గిరిపూజ జరిగింది. కొండకు తాము తెచ్చిన ఆహారపదార్థాలు నైవేద్యం పెట్టారు. గోపాలకు లందరూ కొండకు పుష్పాంజలు లిచ్చి నమస్కారాలు చేశారు. అందరూ ఈ పనులలో నిమగ్నులై ఉన్న సమయంలో కృష్ణుడే పర్వతాధిదేవత లాగా కొండశిఖరాన ప్రత్యక్షమై, అందరూ ఆశ్చర్యంతో చూస్తూండగా, చెయ్యి చాచి నైవేద్యమంతా అరగించేశాడు. తరవాత అతను, "మీ భక్తికి మెచ్చాను. నాకు తృప్తి అయింది," అన్నాడు.



గోపకులంతా చేతులు మోడ్చి, "దేవా, మే మంతా నీ దాసులం. నీ ఆజ్ఞకు లోబడి ఉన్నాం. మాకు ఏమి ఆనతిస్తావో ఇయ్యి. ఆ ప్రకారం నడుచుకుంటాం," అని పర్వత దేవుడితో అన్నారు.

"కొండరూపంలో ఉన్న నన్నే ఇక నుంచీ మీరు దేవతగా ఆరాధించండి. అలా చేస్తే మీ కోరిక లన్నీ తీరుతాయి. మీ గోవులు వృద్ధి పొంది, అమృతధారలు పితుకుతాయి. నేను కామరూపంతో మీలో ఒకడుగా ఉంటూ ఉంటాను," అని చెప్పి కొండ మీది దేవుడు అదృశ్యమయాడు.

గోపాలకులు కొండ మీది కృష్ణుణ్ణీ, కొండకింది కృష్ణుణ్ణీ ఒకే సమయంలో చూసి దణ్ణాలు పెట్టుకున్నారు. తరవాత వాళ్ళు తమ పశువుల కొమ్ములకు రంగులు పూసి పూజచేశారు; వాటి మెడలకు చిరుగజ్జెలు కట్టారు; లతలు తెచ్చి వాటి తలలకు చుట్టారు; ఇంకా అనేక అలంకరణాలు చేశారు. అమితోత్సాహంతో పెద్ద పెట్టున కేకలు వేస్తూ కొండ చుట్టూ ప్రదక్షిణం చేసి, అక్కడక్కడా దిగదుడుపులు తీశారు. తరవాత బ్రాహ్మణ సంతర్పణలు చేసి, యజ్ఞశేషాన్ని తాము తమవారితో కలిసి సంతోషంగా తిన్నారు. ఉత్సవం పూర్తి అయింది. కృష్ణుడితో సహా అందరూ పరమానందంతో వ్రేపల్లెకు తిరిగి వెళ్ళిపోయారు.



నేను చాలా సంతోషిస్తాను. నేను కూడా మీ వెనకే వచ్చి మీ ప్రతాపం ఏపాటిదో ఆకాశం నుంచి చూస్తాను,'' అన్నాడు.

గోకులంలో వాళ్ళకు ఈశాన్యదిక్కున మెరుపులు కనిపించాయి. గాలి తీవ్రంగా వీచింది. ఎండ దుస్సహమై, దుర్భరమైన ఉక్క పుట్టుకొచ్చింది. చంటిపిల్లలు అలమటించారు. పెద్దవాళ్ళకు కాళ్ళు బొబ్బలెక్కాయి. చెట్టుచేమలకు చీడ పుట్టుకొచ్చింది. వాన వచ్చే లక్షణాలు బాగా కనిపించాయి.

తూర్పున మేఘం పట్టి ఉరుముతున్నది.

''ఈ అకాలవర్ష మేమిటబ్బా?'' అనుకున్నారు గోపపెద్దలు.

చూస్తూండగానే కాలమేఘాలు ఆకాశమంతటా సంచారం సాగించి, సూర్యుణ్ణి చాటు చేశాయి. ఆకాశం సాంతం మూసుకుపోయింది. పెళపెళార్భాటాలతో, కళ్ళు చెదిరే మెరుపులతో పిడుగులు పడనారంభించాయి. తరవాత వడగళ్ళుపడ్డాయి. ఆ వెంటనే, భూమ్యాకాశాల మధ్య ఎడం లేకుండా కుంభవర్షం ప్రారంభమయింది.

ఆ వర్షం చూసి గోపకులు బెదిరిపోయారు. ప్రళయం ప్రారంభమైనట్టు వారికి తోచింది. ఆ వర్షం నుంచి ప్రాణాలెలా కాపాడుకోవాలో, ఎక్కడికి పారి

అక్కడ స్వర్గంలో ఇంద్రుడికి తీరని అవమానమై, పట్టరాని కోపం వచ్చింది. అతను సంవర్తం మొదలుగా గల మహామేఘాలను పిలిచి, ''చూశారా, బృందావనంలో ఉండే నందగోపకుడు మొదలైన ముసలి గోపకులు మదమెక్కి, ఏటా నాకు చేసే పూజలు మాని, కపటి అయిన కృష్ణుడి మాటలు విని, ఒక చచ్చుకొండకు చేశారు. అంతటితో అయిందనుకున్నారు కాబోలు. మీరు ఏడు రోజులపాటు ఎడా తెరిపీ లేకుండా బ్రహ్మాండమైన వాన కురిసి, వాళ్ళకు బతుకుతెరువుగా ఉండే గోవులకు హాని కలిగించండి. ఆ విధంగా ఆ గోపకులకు హాని కలిగించి వచ్చారంటే



పోవాలో వారికి తోచలేదు. పశువులపాట్లు వర్ణనాతీతం. చెట్లు కూడా తీవ్రంగా దెబ్బ తిన్నాయి. కొన్ని పిడుగులు పడి మాడి పోయాయి, కొన్నిటిని గాలి పడగొట్టింది, మరికొన్ని వరదలలో కొట్టుకుపోయాయి. గాలివాన అక్కడి అరణ్యాలన్నిటినీ బీభత్సం చేసేసింది. పక్షులు అసంఖ్యాకంగా చచ్చాయి.

ఇక మనుషుల దుస్థితి వర్ణనాతీతం. గుడిసెలు కూలిపోయాయి. బళ్ళు తిరగబడ్డాయి. పశువులు చాలా నశించాయి. వంటలూ, వార్పులూ లేవు. పాలు పితకటం నిలిచిపోయింది. ఆ దుస్థితిలో గోపకులు కృష్ణుడి వద్దకు వెళ్ళి, ''నువే మాకు దిక్కు! కాపాడు! కాపాడు!'' అని మొరపెట్టుకున్నారు.

కృష్ణుడికి ఇంద్రుడి దుర్బుద్ధి అర్థమయింది. తనకు జరగవలసిన ఉత్సవాన్ని కృష్ణుడు మాన్పించాడన్న రోషంతో, గోకులం మీద ఇంద్రుడిలా పగ దీర్చుకుంటున్నాడు. ఇలా చెయ్యటంతో కృష్ణుడు అసహాయుడైపోతాడని ఇంద్రుడి నమ్మకం. గోవర్ధనపర్వతాన్ని ఆకాశాని కెత్తి దాని కింద గోపకులకూ, గోవులకూ రక్షణ కలిగించటానికి కృష్ణుడు నిశ్చయించాడు.

అతను వెంటనే గోవర్ధనపర్వతాన్ని అవలీలగా భూమి నుంచి పెరికి, తన చేత్తో గొడుగు లాగా ఎత్తి పట్టుకున్నాడు. అతను దాన్ని పెకలించేటప్పుడు గండ రాళ్ళు పెద్ద చప్పుడుతో కిందికి దొర్లి వచ్చాయి. చెట్లు కూలిపడ్డాయి. గుహలలో ఉండే సింహాలూ, బిలాలలో ఉండే పాములూ బయటికి వచ్చాయి. దాని మీద ఉండే విద్యాధరులు పారిపోయారు; తపస్సు చేసుకునే మునులకు తపోభంగమయింది.

కృష్ణుడు గోవర్ధనగిరి ఎత్తి, ''మీరూ మీ పశువులూ దీని కిందికి వచ్చెయ్యండి. వాన మిమ్మల్ని బాధించదు.'' అని గోపకులను పిలిచాడు. వాళ్ళు మరుక్షణమే బిలబిలా పరిగెత్తుకుంటూ, తమ సామాను

లనూ, ఋళ్ళనూ, స్త్రీలనూ, పిల్లలనూ, గోవులనూ వెంటబెట్టుకుని కొండ కిందికి వచ్చేశారు.

ఏడు రోజులూ కుంభవర్షం కురిసిన తరవాత, ఇంద్రుడు మేఘాలను ఉపసంహరించి వెళ్ళిపోయాడు. ఆకాశం నిర్మలమయింది. గోపకులమంతా కొండ కింది నుంచి ఇవతలికి వచ్చేసింది. కృష్ణుడా పర్వతాన్ని యథాస్థానంలో ఉంచేశాడు. తరవాత అతను కొండ మీద ఎక్కి కూర్చుని, చుట్టూ మేతలు మేస్తూ సంచరించే గోవులను చూడసాగాడు.



కృష్ణుడు చేసిన అద్భుతం చూశాక ఇంద్రుడు నిర్వికారంగా ఇంట్లో కూర్చోలేకపోయాడు. అతని కేదో బెదురు పుట్టింది; అందుచేత కొద్దిమంది దేవతలను వెంట తీసుకుని, ఐరావత మెక్కి, వజ్రాయుధం చేత బట్టి, భూలోకానికి దిగి, గోవర్ధనగిరి మీద కృష్ణుడు కూర్చుని ఉన్న చోటికి వచ్చి, కృష్ణుణ్ణి చూసి అతను దేవదేవుడని తెలుసుకుని, ఐరావతాన్ని దిగి, భక్తితో తల వంచి నమస్కరించాడు.

కృష్ణుడు ఇంద్రుణ్ణి చూడనట్టు నటిస్తూ నిశ్చలంగా కూర్చుని ఉండిపోయాడు. అతనికి తనమీద ఆగ్రహంగా ఉందని ఇంద్రుడు గ్రహించి, స్తోత్రపాఠాలు చదివాడు; గోపాలుడుగా ఉన్న కారణం చేత సర్వేశ్వరుడని గుర్తించలేక, తాను మదాంధత్వంతో అపచారం చేశానని ఒప్పుకున్నాడు; క్షమించవలసిందని వేడుకున్నాడు. తరవాత అతను కృష్ణుణ్ణి గోపతిగా అభిషేకించి, అతడికి దివ్యాంబరాభరణాలు కట్టబెట్టాడు.

చివరకు ఇంద్రుడు కృష్ణుడితో ఇలా అన్నాడు:

"కంసుడి కింద ఇంకా అనేకమంది రాక్షసులు నీకు హాని చేయాలని ఉన్నారు. వారందరూ నీ చేత చస్తారు. కంసుణ్ణి కూడా చంపి నువు రాజువవుతావు. మీ మేనత్త అయిన కుంతికి ధర్మరాజూ,

భీముడూ పుట్టాక నావల్ల అర్జునుడు కలిగాడు. అతడు నీకు భక్తుడై నిన్నా శ్రయిస్తాడు. నువ్వతన్ని ఆదరించి, కనిపెట్టి ఉండాలి, అతనికి కీర్తి తేవాలి. ముందుముందు కౌరవ పాండవ యుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో అసంఖ్యాకులైన రాజులు పాల్గొంటారు. అందులో అతనికి విజయం చేకూర్చిపెట్టాలి, ఇదే నా కోరిక.''

దానికి కృష్ణుడు జవాబిస్తూ, ''మా మేనత్త కొడుకులు అయిదుగురూ మహా పరాక్రమ సంపన్నులు, దేవతాంశలతో జన్మించినవారు. ఒకనాడు భూమి కంతకూ ఏలికలు కాబోతారు. అందరిలోకీ మధ్యవాడైన అర్జునుడు అసాధారణ శౌర్యవంతుడు. ఈ విషయాలన్నీ నాకు ముందే తెలుసు. నువ్వెంత చెప్పావో అంతా చేస్తాను. నువు రావటం నాకు చాలా సంతోష కారణ మయింది. ఇక నువు స్వర్గలోకానికి నిశ్చింతగా వెళ్ళవచ్చు,'' అని చెప్పాడు.

ఇంద్రుడు కృష్ణుడి కాళ్ళ మీద సాష్టాంగపడి, అతని చుట్టూ ప్రదక్షిణం చేసి, ఐరావత మెక్కి, దేవతలతో సహా సంతోషంగా తన లోకానికి వెళ్ళిపోయాడు. తరవాత కృష్ణుడు కొండ దిగి వ్రేపల్లెకు వచ్చేశాడు.

అతను రాగానే గోపప్రముఖు లందరూ అతని చుట్టూ మూగారు. అతను మామూలు మనిషి కాదనీ, మహా మహిమాన్వితుడనీ వారి కీ సారి పూర్తిగా తెలిసిపోయింది. వాళ్ళు అతనితో, ''బాబూ, మా మధ్య ప్రచ్ఛన్నంగా ఉంటున్న నువ్వు నిజంగా ఎవరు ? మూడు లోకాలనూ రక్షించ గలిగినట్టున్నావు. ఇక్కడ గోవులను కాస్తున్నావే ? నిన్ను చూస్తే మాకు లోలోపల భయంగా ఉంది చెప్పొద్దూ !'' అన్నారు.

కృష్ణుడు చిన్నగా నవ్వి, ''నేను మీవాణ్ణే గదా, ఈ ప్రశ్నలన్నీ దేనికి ?'' అన్నాడు. అందరూ పరమానంద భరితులయారు.





# నౌకరు నిజాయితీ

జగన్నాథం, ఉమాపతి అనే అరవైఏళ్ళ వయసువాళ్ళిద్దరు, రామనగరం శివార్లు దాటగానే, పెనుగాలితోపాటు పెద్దవర్షం ప్రారంభమైంది. వాళ్ళు తల దాచుకోవడానికి వడివడిగా నడిచి, దాపులలో వున్న ఒక శిథిలాలయం చేరారు. ఆ సరికే అక్కడ ఒక యువతి కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ విచారంగా కూర్చుని వున్నది.

వాళ్ళామెను చూసి ఆశ్చర్యపోయి, ''ఏదో తుఫాను వచ్చేలా వున్నది, నువ్వు ఒంటరిగా యిక్కడ ఎలా చిక్కుకుపోయావమ్మా?'' అని అడిగారు.

ఆ ప్రశ్నకు జవాబు చెప్పేందుకు, ఆమె కొంచెంసేపు తటపటాయించి, చివరకు, ''నాకు జీవితం మీద విరక్తి కలిగింది. ఆత్మహత్య చేసుకునేందుకు రాణివాసం వదిలి బయలుదేరి, యిక్కడ గాలివానలో చిక్కుకుపోయాను,'' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

జగన్నాథం, ఉమాపతి ఆ జవాబుకు చాలా ఆశ్చర్యపోయారు. జగన్నాథం ఆమె కేసి జాలిగా చూస్తూ, ''అమ్మా, రాణివాసంలో వుండే నీకు, యిలా ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచన ఎందుకు కలిగింది?'' అని అడిగాడు.

ఆమె కొంచెంసేపు మౌనంగా తల వంచుకుని, తర్వాత, ''ఇవ్వాళ రాణీగారూ, రాజుగారూ నా వివాహం గురించి మాట్లాడుకోవడం విన్నాను. వాళ్ళు నన్ను, మా జమీపనులు చూసే శివానందుడు అనే నౌకరు కొడుక్కు యిచ్చి చేయాలనుకుంటున్నారు. నేను రాజుగారిని ఒంటరిగా కలుసుకుని, యీ పెళ్ళి యిష్టం లేదని చెప్పాను. దాని కాయన ఏమన్నాడో తెలుసా? మీ నౌకరు శివానందుడికి,

మల్లవరపు మనోహరరెడ్డి



నువ్వెంతో రుణపడి వున్నావు. ఆ సంగతి నీకు తెలియదు. అతడి కొడుకును పెళ్ళాడడమే ధర్మం—అని జవాబిచ్చాడు. జమీందారు కుమార్తెనై వుండి, నౌకరు కొడుకును పెళ్ళాడడమా? అందుకే ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాను,'' అన్నది.

ఆమె చెప్పింది విని, జగన్నాథం, ''జమీందారు రంగరాయభూపతి కుమార్తె ప్రమీలవు, నువ్వేనా? నిన్ను చంపాలని శతవిధాల ప్రయత్నించి, చివరకు కారాగారం పాలయిన దుర్మార్గులం, మేమే నమ్మా! ఈ రోజే విడుదలయ్యాం. కారాగారంలో వున్నప్పుడు, చేసిన పాపాలకు కుమిలిపోయి, నా భార్య భద్రావతి చనిపోయింది. విడుదలయ్యాక, నీకేదైనా మేలు చేసి కొంతయినా పాపపరిహారం చేసుకుందామని, మన గ్రామానికే బయలుదేరాం,'' అన్నాడు.

''ఆ శివానందుడే, అడ్డుపడకపోతే, నిన్ను చంపి ఏడుజన్మల పాపం మూటగట్టుకునేవాళ్ళం,'' అన్నాడు ఉమాపతి బాధగా.

''ఆ శివానందుణ్ణి, రాజుతోపాటు మీరూ ఎందుకు మెచ్చుకుంటున్నారో అర్థం కావడం లేదు,'' అన్నది ప్రమీల కాస్త చిరాకుగా.

అందుకు జగన్నాథం చెప్పిందేమంటే—

రంగరాయభూపతికి ఏదో వ్యాధి సోకి, ఎన్ని వైద్యాలకూ లొంగక ప్రాణంమీదికి వచ్చింది. ఆయన భార్యపోయి చాలా కాలమయింది. ఆ దశలో, ఆయనకు బంధువుల మీద నమ్మకం లేకపోవడం చేత, దివాను ఉమాపతినీ, మిత్రుడు జగన్నాథాన్నీ, ఆరేళ్ల ప్రమీలకు సంరక్షకులుగా నియమించాడు. ప్రమీలకు పెళ్ళీడు వచ్చేవరకూ, ఆస్తిపాస్తుల్ని కాపాడవలసిన బాధ్యత కూడా వాళ్ళదే. ఆ తర్వాత కొద్ది రోజులకే జమీందారు మరణించాడు.

వారం తిరక్కుండానే జగన్నాథం, భార్య భద్రావతితో దివాణంలోనే కాపురం పెట్టి, ప్రమీలను కష్టాలపాలు చేయసాగాడు. ఎలాగైనా ప్రమీలను, ఎవరూ అనుమానించనివిధంగా సహజమరణానికి గురిచేసి, జమీ మొత్తం తమది చేసుకోవాలని, ఆ భర్యాభర్తలు పథకం వేశారు. ఇందుకు ఉమాపతి సాయం చేస్తానన్నాడు.




వాళ్ళ దురాలోచనను పసిగట్టి, నౌకరు శివానందుడు, ప్రమీలను కంటికి రెప్పలా కనిపెట్టుకుని వుండేవాడు. ఈ పరిస్థితుల్లో, రంగరాయభూపతిపట్ల ఎంతో అభిమానం గల, ఆ దేశపురాజు శ్రీవర్ధనుడు దేశ పర్యటన చేస్తూ, రంగరాయభూపతి జమీ గ్రామానికి వచ్చాడు.

ఆ సమయంలో ప్రమీల అన్నపానాలు సరిగాలేక నీరసస్థితిలో వున్నది. రాజు రాక తెలిసిన భద్రావతి, ప్రమీలచేత అప్పటికప్పుడు తలంటుస్నానం చేయించి, పట్టువస్త్రాలు కట్టబెట్టి, చక్కని విందు భోజనం పెట్టింది.

రాజు, ప్రమీలను చూడవచ్చి, "ఏమ్మా బావున్నావా ? మీ నాన్న నియమించిన సంరక్షకులు నిన్ను బాగా చూస్తున్నారా?" అని అడిగాడు.

, ఆ సమయంలో భద్రావతి, ప్రమీలకు ఎదురుగా వున్న తెరచాటున నిలబడి, గుడ్లురుముతూ ప్రమీల కేసి చూడసాగింది. అయినా, ప్రమీల భయపడక, "మీలాంటివారు వచ్చిన రోజే, నాకు మంచి భోజనం. మిగిలిన రోజుల్లో నన్ను గురించి ఎవరూ పట్టించుకోరు," అని జవాబిచ్చింది.

రాజు, ఆమె సంరక్షకులు ముగ్గుర్నీ గట్టిగా మందలించి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఆ రోజు రాత్రి భద్రావతి, ప్రమీలను సామాన్లకొట్లో పెట్టి, ముంతపొగవేసింది. తెల్లవారి వచ్చిన శివానందుడు, స్పృహ తప్పి పడివున్న ప్రమీలకు ఉపచారాలు చేసి స్పృహ తెప్పించాడు.



ప్రమీల ఏడుస్తూ, "నన్ను మీ ఇంటికి తీసుకుపో, తాతయ్యా! వీళ్ళు నన్ను చంపేస్తారు," అన్నది.

రెండు రోజుల తర్వాత జగన్నాథం, శివానందుణ్ణి పిలిచి, "ప్రమీల ఆరోగ్యం ఏమీ బావుండడం లేదు. నిన్న వైద్యుడు పరీక్షచేసి మందుకోసం యివ్వాళ నిన్ను పంపమన్నాడు. వెళ్ళి మందు తీసుకురా!" అని చెప్పాడు.

శివానందుడు వెళ్ళి, వైద్యు డిచ్చిన గుళికలు తీసుకుని, అనుమానం కొద్దీ వాటిని దారిలోనే పారేసి, చక్కెరగుళికలతో సీసా నింపుకువచ్చాడు. ఆ మందు వారం రోజులపాటు వాడినా, ప్రమీలకు ఎలాంటి హానీ కలక్కపోవడం చూసి, కుట్రదారులు ముగ్గురూ చాలా ఆశ్చర్యపోయారు.

తర్వాత వాళ్ళు, ఒక భూతవైద్యుణ్ణి తీసుకువచ్చి, ముగ్గులు వేయించి, వాటి మధ్య ప్రమీలను కూర్చోబెట్టి మంత్రాలు చదివించసాగారు. ఇదంతా ప్రమీలకు హాని చేయడానికి చేస్తున్న తతంగం అని గ్రహించిన శివానందుడు, మర్నాటి అర్ధరాత్రివేళ ప్రమీలను తీసుకుని పక్క గ్రామంలో వున్న తన బంధువుల యింట చేర్చి, దివాణానికి తిరిగివచ్చి, ఏమీ ఎరగనట్టు నిద్రపోయాడు.

తెల్లవారాక, ప్రమీల కనబడడం లేదన్న విషయం దివాణంలో గుప్పుమన్నది. దివాణం నౌకర్లేకాక, గ్రామస్థులు కూడా ఉమాపతీ, జగన్నాథాలను అనుమానించారు. గతించిన జమీందారు మంచితనంవల్ల, అందరికీ ప్రమీలపట్ల వాత్సల్యం వున్నది. వాళ్ళు పది రోజులపాటు చూసి, ప్రమీల జాడ తెలియకపోవడంతో, రాజుకు ఫిర్యాదు చేశారు.

రాజు జగన్నాథం, ఉమాపతి, భద్రావతిని విచారించి, వాళ్ళకు కారాగారశిక్ష విధించాడు.

కొన్ని దినాలు గడిచాక, శివానందుడు, ప్రమీలను తీసుకుపోయి, రాజుకు అప్ప

గించి, "ప్రభూ, ఆస్తికోసం పసిబిడ్డ అని కూడా చూడక ప్రాణాలు తీయబోయిన దుర్మార్గులనుంచి, యీ బిడ్డను కాపాడి, యింతకాలం రహస్యంగా దాచివుంచాను. నేను చేసినది తప్పయితే శిక్షించండి!" అన్నాడు.

రాజు, శివానందుడి ద్వారా జరిగినదంతా తెలుసుకుని, "ఇంత చేసినవాడివి, ప్రమీల సంరక్షణ భారం కూడా నువ్వే తీసుకో," అన్నాడు.

అందుకు శివానందుడు ఒప్పుకోక, "ధనం కోసం ప్రమీలచుట్టూ ప్రమాదాలు పొంచి వున్నాయి. ఈ బిడ్డ మీ సంరక్షణలోనే క్షేమంగా వుండగలదు," అన్నాడు.

ఆ రోజు నుంచీ ప్రమీల, రాజుగారి ప్రాపకంలో వుండిపోయింది. రాజు జమీ వ్యవహారాల బాధ్యత అంతా శివానందుడికి అప్పగించాడు. అతడు ఎంతో నిజాయితీగా వాటిని నిర్వహిస్తూ, ఏటా ఫలసాయంలోనూ, శిస్తు వసూళ్ళలోనూ, వచ్చే రాబడిని, రాజుకు ముట్టజెబుతూన్నాడు.

జగన్నాథం చెప్పింది విని, ప్రమీల కళ్ళనీళ్ళు పెట్టుకుని, "నిజానిజాలు తెలియక, ప్రాణంకాపాడిన శివానంద తాతను తక్కువచేసి మాట్లాడాను. ఈ తప్పును ఏ దేవుడు క్షమిస్తాడు!" అన్నది బాధగా.

ఉమాపతి, జగన్నాథం ఆమెను ఓదార్చి, "తల్లీ, యింతకూ యిప్పుడు ఏం చేయదలచుకున్నావు?" అని అడిగారు.

"మీలో ఒకరు నాతోపాటు, మా దివాణానికి రండి. మరొకరు వెళ్ళి రాజుగారికి నా క్షేమం చెప్పండి. తర్వాత శివానందుడి కుమారుడితో జరగబోయే, నా వివాహానికి వచ్చి, మీ చేతులతో నాలుగు అక్షింతలు వేసి ఆశీర్వదిస్తే సంతోషిస్తాను," అన్నది ప్రమీల.

ఆసరికి వర్షం బాగా తగ్గిపోయింది. ఉమాపతి, ప్రమీల వెంట జమీందారుగారి గ్రామానికి బయలుదేరాడు. జగన్నాథం తిరిగి రామనగరం దారి పట్టాడు.





# సౌదామిని కథ

చందనదేశాన్ని అనంగవర్మ అనే రాజు పాలిస్తూండేవాడు. ఆయనకు సౌదామిని అనే కుమార్తె తప్ప, వేరే సంతానం లేదు. సౌదామిని మూడేళ్ళ పిల్లగా వుండగా, ఆమె తల్లి చనిపోయింది. అయినప్పటికీ, అనంగవర్మ మరొక వివాహం చేసుకోక, సౌదామినికి తల్లీ తండ్రీ తానే అయి పెంచుతూ వచ్చాడు.

యుక్తవయసు వచ్చేసరికి, సౌదామిని అపురూప సౌందర్యవతిగానూ, అమిత బుద్ధిశాలిగానూ తయారైంది.

ఒకనాడు అనంగవర్మ కుమార్తెతో, "ఇక సాధ్యమైనంతత్వరలో, నీకు పెళ్ళి చేయదలిచాను. ఇవిగో, యివి నానాదేశాల రాకుమారుల చిత్రపటాలు. ఈ తాళ పత్రాల్లో, వారి వివరాలు రాసి వున్నాయి. బాగా ఆలోచించి, నీకు నచ్చిన వరుణ్ణి ఎంచుకో తల్లీ! అతడు నీకు భర్తేకాక, ఈ చందనదేశానికి భవిష్యత్తులో కాబోయే రాజు కూడా అన్న విషయం, నీకు తెలిసిందేగదా!" అని, కొన్ని చిత్రపటాలనూ, తాళపత్రాలనూ సౌదామినికి యిచ్చాడు.

సౌదామిని వాటిని అందుకుని పక్కన పెట్టి, కొంతసేపు దీర్ఘాలోచనలో వుండి పోయింది. ఆ తర్వాత, "నాన్నగారూ, నాకు కాబోయే భర్త తాలూకు అందచందాలనూ, శౌర్యపరాక్రమాలనూ, నేను వితర్కించవలసిన అవసరం లేదు. అవి మీరే చూడగలరు. అయితే, నా కాబోయే భర్త సౌశీల్యాన్ని మాత్రం, నేను నాకు తోచిన విధంగా పరీక్షించదలచుకున్నాను. ఆ పరీక్షలో నెగ్గిన వ్యక్తినే, నేను వివాహ మాడతాను. సౌశీల్యాన్ని మించిన సుగుణమూ, అందమూ లేదని, నా అభిప్రాయం," అన్నది.

కుమార్తె మాటలకు సంతోషించిన అనంగవర్మ, ''ఏమిటి, నీ పరీక్ష ?'' అని అడిగాడు.

''నేను, మీకొక కథ చెబుతాను. నన్ను పెళ్ళాడ వచ్చిన వ్యక్తికి, మీరా కథ చెప్పండి. అందులో గల సమస్యను పరిష్కరించగల వ్యక్తి, విజేత అవుతాడు,'' అని, తండ్రికి కథ చెప్పసాగింది:

పూర్వం వత్సలదేశాన్ని చక్రసేను డనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఆయన కుమార్తె పేరు కనకప్రభ. ఆమె అపురూప సౌందర్యవతి.



ఒకసారి వత్సలకు మిత్రదేశమైన కౌండిన్యదేశపు రాజు విశ్వంభరుడు, వత్సలలో జరుగుతున్న ఉత్సవంలో పాల్గొనడం కోసం, వత్సలదేశానికి వచ్చాడు.

ఆ సమయంలో చక్రసేనుడి విశ్రాంతి మందిరంలో వున్న చిత్రాలను చూస్తున్న విశ్వంభరుడు, ఒక సుందరి చిత్రాన్ని చూస్తూ వుండిపోయాడు.

అది గమనించిన చక్రసేనుడు, ''చిత్రంలోని సుందరి, అప్సరకాంతలను తలదన్నేలా వున్నది. అవునా ? నాకు కూడా, ఆ చిత్రమంటే చాలా యిష్టం,'' అన్నాడు.

ఆ మాటలకు విశ్వంభరుడు చిరునవ్వు నవ్వి, ''నేను చూస్తున్నది, చిత్రంలోని సుందరి అపురూప సౌందర్యాన్ని కాదు. ఎందుకనో నాకు, యీ చిత్రం ఎడమచేత్తో లిఖించబడినదిగా అనిపించింది,'' అన్నాడు.

మిత్రుడన్నదానికి చిత్రసేనుడు ఆశ్చర్యపడి, ''లేదు, లేదు ! ఈ చిత్రాన్ని చిత్రించిన మాధురు డనే చిత్రకారుడు కుడిచేత్తో గీస్తూండగా, నేను స్వయంగా చూశాను. నువ్వు పొరబడుతున్నావు,'' అన్నాడు.

''నీ ఎదుట అతడు కుడిచేత్తోనే గీసి వుండవచ్చు. కాని, నిజానికి యీ చిత్రం ఎడంచేత్తో గీసిందేనని, నేను ఖచ్చితంగా చెప్పగలను,'' అన్నాడు విశ్వంభరుడు.



ప్రశ్న విని ముందు తడబడి, తర్వాత తను ఆ చిత్రాన్ని ఎడమచేత్తో గీసినట్టు ఒప్పుకున్నాడు.

చక్రసేనుడు కాస్త చిన్నబోయి, వెంటనే సర్దుకుని, మాధురుణ్ణి పంపించి వేశాడు. తర్వాత విశ్వంభరుడితో, "నేను ఓడిపోయినా, నాకు లాభమే చేకూరింది. మన స్నేహం బంధుత్వంగా మారనున్నది. మహారాణికీ, కనకప్రభకూ చెప్పి, సాధ్యమైనంత త్వరలో ముహూర్తం పెట్టిస్తాను," అన్నాడు.

విశ్వంభరుడు సంతోషంగా అందుకు అంగీకరించాడు.

చిత్రసేనుడు కాస్త పౌరుషపడి, "సరే, యిప్పుడే మాధురుణ్ణి పిలిపించి నిజం చెప్పిస్తాను. నేను ఓడిపోతే, నా కుమార్తె కనకప్రభను, నీ కుమారుడి కిచ్చి పెళ్ళి చేస్తాను," అన్నాడు.

అందుకు విశ్వంభరుడు తల వూపి, "ఈ షరతు నాకు బాగున్నది. నేను ఓడిపోతే, బతికున్నంతకాలం, ఏటా నీ దేశంలోని అభివృద్ధి కార్యక్రమాలకు ఏభైవేల వరహాల చొప్పున విరాళం పంపిస్తాను. సరేనా?" అన్నాడు.

చక్రసేనుడు, మాధురుడికి కబురు పంపించాడు. గంటకాలం గడవకుండానే రాజు దగ్గిరకు వచ్చిన మాధురుడు, ఆయన

ఇది యిలా వుండగా—ఆ రోజు సాయంత్రం, కనకప్రభ తల్లి మహారాణి ఇందుమతీదేవి, తమ ఇలవేల్పు అయిన స్వయంప్రభాదేవి ఆలయానికి వెళ్ళి, తిరిగి వస్తూండగా, నలుగురు దొంగలు మహారాణి వున్న పల్లకీ బోయీల మీద పడి అటకాయించారు. అడ్డగించబోయిన బోయీలు, ఆ దొంగల చేతుల్లో చావు దెబ్బలు తిన్నారు. దొంగలధాటికి ఆగలేక, వీధిలోని జనం భయభ్రాంతులై చెల్లాచెదరై పోయారు.

దొంగలు నలుగురూ, మహారాణిని సమీపించబోతూండగా, మెరుపులా ఒక యువకుడు వచ్చి, వారి మీద పడ్డాడు.

అతడి కత్తిదెబ్బలకు తట్టుకోలేక, దొంగలు పారిపోజూశారు. అయితే, రాజభటులు వాళ్ళను తరిమిపట్టుకుని, సంకెళ్ళు వేసి లాక్కుపోయారు.

ఇందుమతీదేవి, ఆ యువకుణ్ణి దగ్గరకు పిలిచి "ఎవరు నాయనా, నువ్వు?" అని ప్రశ్నించింది.

యువకుడు వినయంగా, "నన్ను రాజశేఖరుడంటారు. మహాసేనాని త్రివిక్రమ వర్మగారి బంధువును," అన్నాడు.

ఆ జవాబు వింటూనే ఇందుమతీదేవి సంతోషంగా, "ఓహో, మహాసేనాని పుత్రసమానుడిగా చూసుకుంటున్న, ఆయన చెల్లెలి కొడుకువు, నీవేనా?" అని అడిగింది.

రాజశేఖరుడు అవునన్నట్టు తల వూపాడు.

"నువ్వు కాశీలో విద్యాభ్యాసం చేస్తున్నట్టు విన్నాను. అది ముగిసిందా?" అన్నది ఇందుమతీదేవి.

"నెల రోజుల క్రితమే ముగించుకుని వచ్చానమ్మా." అన్నాడు రాజశేఖరుడు.

"సంతోషం, నాయనా! నన్ను కాపాడిన నీకు ఎంతయినా ఋణపడి వున్నాను. నీ ఋణం తీర్చుకునేందుకు, నేను యివ్వగలిగితే, నా దగ్గిర వున్న వెలలేని సువర్ణాన్ని నీకు యిస్తాను," అని, పల్లకీలో వెళ్ళిపోయింది, మహారాణి.

మహారాణి నిగూఢంగా, తనకు కనకప్రభ నిచ్చి వివాహం చేస్తానని



చెప్పిందని, రాజశేఖరుడు అర్థం చేసుకున్నాడు.

తల్లిదండ్రులు, తన వివాహం గురించి, మనసా భిన్నాభిప్రాయాలతో వున్న ఆ సాయంకాల సమయంలో, యువరాణి కనకప్రభ చెలికత్తెలతో కలిసి ఉద్యానవనంలో విహరిస్తున్నది. చెలికత్తెలు కోరగా, ఆమె ఏదో గీతాన్ని ఆలాపిస్తూ, ఒక పొదరింటిపక్కకు వెళ్ళింది.

ఆ సమయంలో, ఆకాశమార్గాన పోతున్న వరుణదత్తు డనే గంధర్వుడు, అప్సరసలను మించిన ఆమె సౌందర్యాన్ని చూసి ముగ్ధుడై, ఆమె వున్నచోటుకు దిగివచ్చాడు.

ఏనాడూ ఊహించని విధంగా, గంధర్వుడు తన ముందు ప్రత్యక్షమవగానే, కనకప్రభ విస్మయంతో నిశ్చేష్టురాలైంది. చెలికత్తెలు దూరంగా వెళ్ళిపోయారు.

వరుణదత్తుడు, కనకప్రభతో, ''ఆకాశమార్గాన పోతున్న నన్ను, నీ సౌందర్యప్రభలు, నీదరికి తీసుకువచ్చాయి. నేను వరుణదత్తు డనే గంధర్వుడను. నీకు అభ్యంతరం లేకపోతే, నిన్ను వివాహం చేసుకుంటాను,'' అన్నాడు.

గంధర్వుడి మాటలు విన్న కనకప్రభ, ఉక్కిరిబిక్కిరయింది. గంధర్వుడంతటివాడు, తన సౌందర్యానికి మెచ్చి వివాహం చేసుకుంటానని అడగడంతో, ఆమె ఒక్కసారిగా అంతులేని ఆనందాశ్చర్యాలకు లోనైంది.

ఆమె, వరుణదత్తుడికి, తన అంగీకారం తెలియజెయ్యడానికి సంసిద్ధమవుతున్న తరుణంలో, తల్లిదండ్రులు గుర్తుకు వచ్చారు.

ఆమె వరుణదత్తుడితో, ''ఏమైనా నేను కన్యను గదా! నా తల్లిదండ్రుల ముఖతః, రేపు మీకు, నా అంగీకారాన్ని తెలియజేస్తాను,'' అన్నది.

వరుణదత్తుడు చిరునవ్వుతో సరేనన్నట్టు తలవూపి, మర్నాడు వస్తానని చెప్పి, వెళ్ళిపోయాడు.—(ముగింపు వచ్చే సంచికలో)





# డబ్బు విలువ

విమలానందుడనే సాధువు, తన శిష్యులతో కలిసి తీర్థయాత్రలు చేస్తూ, రంగాపురం అనే గ్రామానికి వచ్చాడు. ఆ గ్రామంలో అందరికన్నా ధనవంతుడు లింగయ్య అనే ఆయన. గ్రామస్థులు సాధువుకూ, ఆయన శిష్యులకూ ఏర్పాటుచేసిన విడిదీ, భోజనాలకు అయ్యే ఖర్చులన్నీ, లింగయ్యే భరించాడు. సాధువుకు సేవలన్నీ చేశాడు.

కొన్ని రోజుల తర్వాత, విమలానందుడు గ్రామం వదిలిపోతూ, తనకు వీడ్కోలు ఇవ్వవచ్చిన గ్రామస్థులను ఆశీర్వదిస్తున్నాడు. ఆ సమయంలో, తన పక్కన చేతులు కట్టుకుని నిలబడివున్న లింగయ్యను, ఆయన ఆప్యాయంగా, ''నాయనా, అగర్భ శ్రీమంతుడివి. అష్ట ఐశ్వర్యాలతో తులతూగుతున్నవాడివి. ఇంకా ఏమికోరి నాకిన్ని సేవలు చేశావో, అడిగి తెలుసుకోవచ్చా?'' అన్నాడు.

అందుకు లింగయ్య ''స్వామీ, మనిషికి డబ్బొక్కటే ప్రధానమా? స్వాముల సేవకన్న వేరే భాగ్యమున్నదా!'' అని సమాధానం చెప్పాడు.

విమలానందుడు, ఆ సమాధానానికి సంతోషించి, లింగయ్యను ఆశీర్వదించబోతూండగా, మంగయ్య అనేవాడు ముందుకువచ్చి, ''స్వామీ, నాదొక చిన్న సందేహం. మనిషికి డబ్బే ప్రధానం కాదని, అందరూ ఎప్పుడుపడితే అప్పుడు, సందర్భం వున్నా లేకపోయినా అనవచ్చునా?'' అని అడిగాడు.

విమలానందుడు మందహాసంచేసి, ''ఒక సత్యాన్ని ప్రకటించడానికి ఎలాంటి నియమాలూ, నిషేధాలూ వుండవు. అయినా, నీకిలాంటి సందేహం ఎందుకు కలిగింది?'' అని మంగయ్యను ఎదురు ప్రశ్న వేశాడు.

జొన్నలగడ్డ రత్న

ఆ ప్రశ్నకు మంగయ్య, "స్వామీ, నేను బహుకుటుంబీకుణ్ణి. పొద్దస్తమానం రెక్కలు ముక్కలు చేసుకున్నా, భార్యా బిడ్డలకు కడుపునిండా తిండి పెట్టలేక పోతున్నాను. ఈ గ్రామంలో ఎక్కువమంది, నాలాంటివాళ్ళే. అందుచేత, మనిషికి డబ్బే ప్రధానం కాదని అంత ఖచ్చితంగా చెప్పాలంటే, లింగయ్యగారి లాగా, ఆస్తిపాస్తులు సంపాదించాకనే సాధ్యమని సందేహపడుతున్నాను," అన్నాడు.

మంగయ్య అన్నదానికి, అక్కడవున్న గ్రామస్థులంతా పెద్దగా నవ్వుతూంటే, లింగయ్య తలవంచుకున్నాడు.

విమలానందుడు వాళ్ళతో, "నాయనలారా! మంగయ్య నిజానికన్నా, నవ్వులాటకన్నా, అతడు సందేహమంటున్నదానిలో గొప్ప ధర్మసూక్ష్మమున్నది. ఏమంటే— వాస్తవానికి డబ్బు సంపాదన మనిషికి ముఖ్యం కాదని చెప్పటం, సొమ్ము కూడబెట్టిన లింగయ్యలాంటి ధనికులకే చెల్లు. అలాంటివాళ్ళు తమ ధనాన్ని, నాలాంటి సాధువులకోసం వెచ్చించేబదులు బీద సాదలకు ఉపయోగపడేట్టు చూసుకోవడం మేలు," అన్నాడు.

సాధువు మాటలకు గ్రామస్థులందరూ, ఆమోద సూచకంగా తలలూపారు.

సాధువు, లింగయ్య భుజంమీద చేయి వేసి, "నాయనా, డబ్బు ప్రధానంకాదు, అన్న నీ మాటకు సార్థకతకలగాలంటే, నేనింతకుముందు చెప్పిన విధంగాచెయ్యి. నేను యీ ధర్మాన్ని, నన్ను సేవించి తరించాలని వచ్చే ధనవంతులకు బోధించకుండా, నేనిన్నాళ్ళూ జాప్యం చేశాను. ఎంతో జ్ఞానాన్ని సముపార్జించాననుకుంటున్న నాకు, సకాలంలో యీ ధర్మసూక్ష్మాన్ని గుర్తు చేసిన మంగయ్యను మరచిపోను!" అని, గ్రామస్థులందరినీ దీవించి, శిష్యులతో ముందుకు సాగాడు.

ఆ తర్వాత లింగయ్య, తన ధనాన్ని గ్రామంలో నలుగురికీ ఉపయోగించే మంచి కార్యాలకు వినియోగిస్తూ, ధర్మదాత అని పేరు తెచ్చుకున్నాడు.






ఆర్కిటిక్ సముద్రంలోని మంచుదిబ్బలు గల్ఫ్ ప్రవాహంలో ప్రవేశించిన మూడువారాల లోపల కరిగిపోతాయి!




తాళవృక్షాలలో దాదాపు 2,800 జాతులు ఉన్నవి., ఇవి చాలావరకు ఉష్ణప్రదేశాలలోనే కనిపిస్తాయి. అయినా, వీటిలో రెండు జాతులు మాత్రం ఐరోపాఖండానికి చెందినవి.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



S. G. Seshagiri



M. Natarajan

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఏప్రిల్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నవ్వు నా సొంతం! రెండవ ఫోటో: ఏడుపు నా పంతం!

పంపినవారు: బి. ఆర్. కృష్ణకుమార్, కాంతినగర్, విదదవోలు—(ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.